Reg. No. 75

శ్రీ

# అభినవసరస్వతి

యనునొక మాసపత్రిక

అష్టావధాని. జానపాటి పట్టాభిరామశాస్త్రిచేఁ

బ్రచురింపఁబడుచున్నది.

గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా, జానపాడు.

సంపుటము 7 | 1915 మే | సంచిక 5

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0

పోషకులకు రు 10 0 0 చందాదారులకు 2 0 0

చంద్రికాముద్రాక్షరశాల, గుంటూరు.

Printed at the Chandrika Press, Guntur
and Published at Janapadu, by the Editor Ashtavadhani
Janapati Pattabhirama Sastry.

# ప్రధానపోషకులు.

1 శ్రీ శ్రీ జగద్గురుపుష్పగిరిస్వాములవారు

## పోషకులు.

1 శ్రీ రాజానారయప్పారావు సింహాద్రప్పారావు బహాదరు జమీందారులు నూజవీడు

2 రాజా వెంకటాద్రిఅప్పారావు బహాదరు జమీందారుగారు, నూజవీడు

3 రాజా వాశిరెడ్డి చంద్రమౌళీశ్వరప్రసాదు బహాదరు మన్నెసుల్తాన్ జమీందారుగారు ముక్త్యాల

4 అల్లాడి లక్ష్మణరావుగారు కరణము జంగపల్లి

5 రామలింగుగారు నెల్లుట్ల షాపురపు సంస్థానము మేనేజరు నెల్లుట్ల

6 రంగాచార్యుల హనుమయ్యగారు జిల్లాకోర్టువకీలు గుంటూరు

7 తాడేపల్లి లక్ష్మీనరసింహారావుగారు మక్తాదారు చోల్లేరు

8 అనంతరెడ్డి దేశముఖుగారు పోతారెడ్డిపేట

9 గూడూరు వీరసాంబశివరావుసర్దేశపాండ్యాగారు, మాలెకొండూరు

## సహాయులు.

1 బీరకాయల రామారావు దేశముఖుగారు రాయగిరి

2 పరాంకుశం శేషాచార్యులుగారు యాదగిరి

3 నరసింహాచార్యులుగారు-పట్వారీ-కొలనుపల్లి

4 హనుమంత రెడ్డిగారు-క్షీరసాగరము

5 వెంకట నారసింహారెడ్డి దేశముఖుగారు-మిడిదొడ్డి

6 అన్నమురాజు సుబ్బారావుగారు నందూరు

7 నందూరు లక్ష్మీనరసింహారావుగారు, కరణం, నందూరు

8 నైషధము సీతాకాంతముగారు మోరంపూడి

9 మెదకు శేషారావు దేశముఖుగారు నల్లబల్లి

10 బాకరాజు పరాంకుశరావుదేశముఖుగారు, యాడవరము

11 కుప్పా శంకరశాస్త్రిగారు, చివలూరు

12 హేజీబు వెంకటరామారావుగారు వకీలు సిరిసిళ్ళ

13 నారసింహారెడ్డి దేశాయిగారు, కాసరబాద

# అభినవసరస్వతి

సంపుట 7. { జానవారు<br>రాక్షస సం॥ వైశాఖమాసము } సంచిక 5.

## కటికినేని రామకవిజీవితము.

ఈకైసరుఁడు పద్మనాయకకులజుఁడు. చెఱుకునూళ్లగోత్రుఁడు. నూరయకును బుచ్చమకును బుత్రుఁడు. ఈసంగతు లితనికువలయానందప్రకాశమువలనఁ దెలియుచున్నవి. ఇది ముద్రితమయియే యున్నది. ఈకవిచరిత్రమును రావుబహదర్ కందుకూరి వీరేశలింగం పంతులవారు వ్రాసిరి కాని కువలయానందప్రకాశము మాత్రమే రచియించినట్లు వ్రాసిరి. ఈకవిచే రచియింపబడిన బ్రహ్మానందచంద్రిక యనునొక్క చిన్నిపొత్తమును మాప్రభువులగు మహారాజరాజశ్రీ రాజా వాసిరెడ్డి శ్రీచంద్రమౌళీశ్వర ప్రసాద్ బహదర్ మన్నెసుల్తాన్ దొరవారి శ్రీసృకేసరిపుస్తకభాండాగారమున నుండఁగఁ జిలికించితిని. ఈగ్రంథము సమగ్రముగనున్నది కాని యచ్చటచ్చట నల్పాహారమును వజ్రదంష్ట్రపుఁ బురువొనరించెను. ఈగ్రంథము వేదాంతవిషయకమయినది. ఇందుఁగవి తనవంశచరితము నేమియు వ్రాయలేదు. గద్యయందు "నూరయసుధీవరపుత్ర" అనిమాత్రము వ్రాసికొనెను. తానురచియించిన గ్రంథముల నీగ్రంథమున నీరీతిఁ జేర్కొనెను.

సీ॥ కంజాక్షుదివ్యమం ♦ గళ విగ్రహ స్తవం, బంచితోక్తుల రచి ♦ యించినాఁడ
క్షేమంకరంబైన ♦ శ్రీరమా సౌందర్య, మంజరిఁ జేసితి ♦ రంజితముగ
శంకరమహిమయు ♦ శాంభవీలీలయు, గణపతిస్తుతియుఁ జ ♦ క్రస్తవంబు
శారదావినుతి కృ ♦ ష్ణవిలాసమును బ్రహ్మ, జీవబోధయుఁ దగఁ ♦ జెప్పినాఁడ

తే॥ గువలయానంద మాంధ్రోక్తిఁ ♦ గూర్చినాఁడ
నుడివితి దశావతారముల్ ♦ నూత్నఫణితి
నమర శ్రీహరిచరణాంబు ♦ జములచెంతఁ
జేరి నాచిత్తమితరేచ్ఛఁ ♦ జెంద దెపుడు॥

ఈపద్యముంబట్టి యీకవి 1 కంజాక్షవిగ్రహస్తవము 2 శంకరమహిమ 3 శాంభవీలీల 4 గణపతిస్తుతి 5 చక్రస్తవము 6 శారదావినుతి 7 కృష్ణవిలాసము 8 బ్రహ్మజీవబోధ 9 కువలయానందప్రకాశము 10 దశావతారములు రచియించినట్లు దెలియనగుచున్నది. ఇందుఁ దొమ్మిదవదిగాఁ జేర్కొనఁబడిన కువలయానందప్రకాశము ము

తమని యిదివరకే వ్రాసియున్నాను. పదునొకండవదిగా రచియింపఁబడిన బ్రహ్మానందచంద్రికను మాప్రభువులు ముద్రింపించిరి. కొలఁదిదినములలో వెలువడును. సంగ్రహముగఁ బీఠికను నేనే వ్రాసియుంటిని. అందీపదిగ్రంథములఁ జేర్కొనుటకుఁబూర్వము "మూఁడవపద్దెముంబట్టి" అనివ్రాసితిని. అదినాపొరబాటు "నాల్గవపద్దెముంబట్టి" అని వ్రాయవలసియుండును. "కంజాతునిదివ్యమంగళవిగ్రహస్తవం" బనుపద్దెము నాల్గవసంఖ్యగలదిగానే యున్నది. ఇది యెంతటి తప్పయినను మన్నింతురని వేడుకొనుచున్నాను. కొన్నిచోటులఁ బ్రాసవిస్రమభంగము మఱికొన్నిచోటుల గణవ్యత్యయము మొదలగు దోషములు నాకుఁగాన్పింపఁగాఁ జేనయినంతవఱకు దిద్దితిని. యింకనుమఱికొన్ని తప్పులుండవచ్చును. అవి కవీశ్వరునితప్పులా? యచ్చుదప్పులా? పరిశోధకునితప్పులా? వ్రాఁతఁదప్పులా? మఱియెవరివి? యని విచారింప నవసరములేదు. ఉన్నయెడల దిద్దితెలిపినచో రెండవసారిముద్రించునపుడయిన సవరించుకొనవీలుండునేమో. గాన నేనువ్రాయునపుడే గలిగినవని యొప్పుకొని వేఁడుటకంటె సమంజసముగుపని నాకు గానరాలేదు. ఈకవిసరునిచే రచియింపఁబడిన గ్రంథములలోఁ గువలయానందప్రకాశముతప్ప మిగిలిన గ్రంథములన్నియుఁ జిన్నచిన్నవి యని తోఁచుచున్నది. చిన్నవియో పెద్దవియో పదిగ్రంథముల నీతఁడు రచియించినట్లు దెలిపి పదునొకండవదియయిన బ్రహ్మానందచంద్రికను దనప్రథమగురుఁడగు కనకాద్రిపండితుని యాజ్ఞానుసారముగ రచియింపఁబడెనని కవియే తద్గ్రంథమున నిట్లువ్రాసికొనెను.

తే॥ ప్రథమగురుఁడైనకనకాద్రి పండితుండు, వచ్చినను గాంచి సత్కృతుల్ వడసియుద్ది
యేనిసత్కృతిరచియింపఁ బూనుమనిన, నింపుమీఱంగ వినయోక్తి, నిట్టులంటి॥

వ॥ అనిన విని మదీయాభిప్రాయంబుఁ దెలిసి యవ్విద్వాంసుఁడిట్లనియె నైనను నీవు పరిపూర్ణపరబ్రహ్మానంద ప్రతిపాదకంబైన యొక్క ప్రబంధంబు విరచించిన నామనంబు పరితృప్తింబొందెడి నని యానతిచ్చిన నేనును గుతూహలాయత్తచిత్తుండనై శంకరకుమారసంవాదరూపంబైన బ్రహ్మానందచంద్రిక యను గ్రంథంబు సంగ్రహంబుగాఁ జేయంబూనితి. అక్కలంకరంగార్యుని తోడ్పాటుచేఁ గువలయానందప్రకాశమును రచియింపఁ గడఁగితి నని కువలయానందప్రకాశమున వ్రాయఁబడియున్నది. రంగార్యుఁడెచ్చటివాఁడో కనకాద్రి పండితుఁడెచ్చటివాఁడో మన వెలమదొర యెచ్చటివాఁడో విస్పష్టముగఁ దెలియుటలేదు. నూటయేబదిసంవత్సరములకుఁ బూర్వపువారని యొకవాడుకగలదు. ముద్రితముగు కువలయానందప్రకాశము నొక్కదానిఁ జూచితిని గాని యయ్యదినాకు లభింపలేదు. ఆగ్రంథమునకుఁ బీఠికవ్రాసిరో లేదో నే నప్పుడు చూడలేదు. యీదొరచే రచింపఁబడిన పదునొకండు గ్రంథములలోఁ గువలయానంద ప్రకాశము బ్రహ్మానంద-చంద్రిక యీరెండు మాత్రమే యిప్పటికిఁ గాన్పించుచున్నవి. మిగిలిన తొమ్మిదిగ్రంథము లెప్పుడెచ్చట నేరివలన వెలువడునో తెలియదు. వెలువడినచోఁ బంపినయెడల మాప్రభువులు ముద్రింపింతురు.

పురాణం రామచంద్రశాస్త్రి.

తే॥ "నీకొఱకు నీదుతండ్రి "యయ్యోకుమారి!
రావదే"మనిశోకింప రావదేమి?
తల్లిదండ్రులపై నల్క తగునటమ్మ?
వద్దురావమ్మ తగనీటు గద్దటమ్మ॥ 93
సీ॥ ప్రొద్దుప్రొద్దున లేచి ముద్దుటంచల కాట
లేర్పడ నేర్పువా రెవ్వరింక
చెక్కిలిగొట్టి రాచిలుకపిండుకుఁ బల్కు
లింపుగాఁ జెప్పువా రెవ్వరింక
ఉపవనాంతరములనుండు పూఁదీవెల
హెచ్చుగాఁ బెంపువా రెవ్వరింక
సరసత సంగీతచాతుర్యమున వీణ
మెసఁగ వాయించువా రెవ్వరింక
ఇంక నెవ్వరు నాతోడఁ గొంకికొంకి
కలికిపలుకులు తిన్నగాఁ బలుకువారు
నిగనిగని రత్నకాంతులు నిగుడుచున్న
తూఁగుటుయ్యాల లింకెవ్వ రూఁగువారు॥" 94

వ॥ అని బహుప్రకారంబుల విలపించె, అంత మణికంధరుండు బంధురరోషాక్రాంతచిత్తుండై యిట్లనియె. 95

క॥ "గురుతరగతి మత్పుత్రిని।బరువడిఁ గొనిచనినయట్టిపాపాత్ముఁడు వి
స్ఫురదుగ్రాహవమండలి।హరిహరకమలాసనాదు లడ్డంబైనన్॥ 96
క॥ భూమిన్ శశికులజలనిధి।సోముండగు శంతనూగ్ర సునిశితభాస్వ
ద్భీమామోఘశరంబుల।చేమరణము జెందు"ననుచుఁ జెలఁగి శపించెన్॥

వ॥ తదీయశాపాగమనం బెఱుంగక యాశతకవచుండు బహువాసరంబు లమ్మోహనాంగి మనోహరాంగిం గూడి యనంగకేళీపరాయత్తచిత్తుండై నానావిధసుఖంబులనుభవించి కాలవశంబున నేఁడు రణంబునకేతెంచి భవదీయనిశితవిశిఖశిఖిశిఖాకలాపంబులఁ బతంగంబు తెఱంగున ద్రుంగె"నని చెప్పి నారదుండు శంతనుతో వెండియు

* నారదుండు శంతనునకుఁ దత్త్వోపదేశము సేయుట *

నిట్లనియె,నరేంద్రా!పృథివ్యప్తేజోవాయ్వాకాశమయంబులై కామక్రోధ లోభమదమాత్సర్యాలయంబులై క్రిమికీటకమలమూత్రరక్తశ్లేష్మవాత పిత్తసంగతంబులై క్షణభంగురంబులగు దేహంబుల నమ్మి హింసారిరంసా పరాయణుండవై యుండం బాడియే? ఇదియునుంగాక మహాభంగభంగ సంగతంబులగు తరంగిణులం బెక్కులగు కాష్ఠంబులు నొక్కడిక్కు ప్రోవ గుచు విచ్చుచందంబున సంసారంబునం బుత్రమిత్రకళత్రభ్రాతృబాంధవ రూపంబులంగూడి యింద్రియసుఖంబులందగిలి జంత్రపుబొమ్మలవి ధంబున వర్తింపుచుం గాలవశంబునం జచ్చుచుం బుట్టుచు నందుం బూ ర్వభవకృతసుకర్మంబువలన జ్ఞానదీపాంకురంబులయిన దేహంబులును దుష్కర్మంబువలన సూకరశునకగార్దభాదిహీనజంతుజన్మంబులును గలిగి వర్తింతు రదియునుంగాక, 98

లయగ్రాహి.

ఘోర మతిదుష్కృతవిచారము వినూత్నభవ
సారము విమోహనవికారము విచిత్రా
ధార మరివర్గసదపారము లసత్సుఖవి
దారము మహోగ్రగుణపూరము ప్రచింతా
గార మురుపుణ్యశిఖినీరము జరామరణ
భారము మనోఘనసమీర మిలలోసం
సార(మిటువంటిదని)యారయక నెమ్మదిని
మేరువుగ నమ్ముటిది మేరయె నృపాలా! ॥ 99

మ॥ కుటిలత్వంబు శిరోజరాజి గురువక్షోజంబులం బంధురో
త్కటకాఠిన్యము చూపులందు నతితైక్ష్ణ్యం బక్షులన్ సంతత
స్ఫుటచాంచల్యము పూని నైజగరిమం బూబోండ్లు వర్తింతు ర
క్కట!(తత్స్వాంతము)లిట్టివంచుఁ దెలియంగారాదయెవ్వారికిన్ ॥

సీ॥ అకలంకచంద్రాస్య లతివలటందురు
ముఖముల రక్తంబు మొనయ లేదా

పుండరీకాక్షులు పూఁబోఁడులందురు
కన్నులందునఁ బుసుల్ గారలేదొ
కాంచనాచలకుచ ల్కాంతలటందురు
నరయఁజన్నులు మాంసమానుకావొ
సైకతశ్రోణులు జలజగంధులటండ్రు
మలమూత్రములు కటిస్థలుల లేవొ
ఔర! భూమండలంబందు ననఁగ వలెనె
బంధురస్తోకనిస్తులబహుళచతుర
ఫణితినొప్పు కవీంద్రుల ప్రాభవములు
వారికేమి, నిరంకుశుల్ గారె కవులు॥ 101

చ॥ కలుగక కొన్ని నాళ్లు సరి కల్గినయంతట భూరిరోగదు
ర్బలములఁగొన్ని నాళ్ళు పటుబంధురదుష్టతఁగొన్ని నాళ్ళు పెం
పలరెడితండ్రి కెప్పుడును హాళిగ దుఃఖముసేయునట్టి పు
త్రులు తగ మిత్రులంచనుచు, తోషముఁజెందఁగనేల ధాత్రిలోఁ॥

తే॥ పుత్రులను మానసమున నమిత్రులనుచు
సూనులను సంతతంబు దుర్మానులనుచుఁ
గొడుకులను నెమ్మది బలు తుందుడుకులనుచుఁ
దలఁపవలయునుజనులు తథ్యంబుగాను॥ 103

చ॥ ధన మిలఁ గామరోషముఖదారుణశాత్రవభూరిశౌర్యసా
ధనము,మహోగ్రపాపసముదాయవిశాలధనంజయోజ్వలేం
ధనము,పరిస్ఫుటప్రచురధర్మసుకర్మవినూత్నమార్గబం
ధనము, తలంచిచూడఁగను దంధన మౌర! వసుంధరాస్థలిన్॥ 104

వ॥ కావున సర్వంబును బరిత్యజించి యనంతంబును నచ్యుతం
బును నవ్యయంబును నమృతంబును నక్షరంబును నప్రతర్క్యంబును
నాదిమధ్యాంతరహితంబును సర్వంబును సర్వపాలకంబును సర్వాతీతం
బును సర్వాధారంబును సర్వపరిపూర్ణంబును నిరంజనంబును నిష్కళం
బును నిరాభాసంబును నిరుపమంబును నిరుపద్రవంబును నిరాలంబంబు

ను నిర్గుణంబును నిత్యంబును నిగమాంతవేద్యంబును నైన పరబ్రహ్మ స్వరూపంబును హృదయకమలకర్ణికామధ్యంబున ధ్యానంబు సేయవల యు"నని చెప్పి మఱియునిట్లనియె, 105

సీ॥ సర్వసర్వంసహాచక్రజనస్తుత్య
సత్యనిత్యుండు హరిశ్చంద్రుఁడేడి
నిర్మలసత్కీర్తి నిఖిలసుపర్వాది
నాయకుండైనట్టి నహుషుఁడేడి
అష్టదిగ్విజయ బాహాటోపనైపుణి
విఖ్యాతిఁగిన కార్తవీర్యుఁడేడి
భూరివిజ్ఞాన విస్ఫూర్తి శీతోష్ణముల్
సమముగాఁ బరఁగిన జనకుఁడేడి
వినుతదశకంఠ కంఠలుంఠనమహోగ్ర
చండకోదండనిర్ముక్త శాతవిశిఖ
భాసురుండైన శ్రీరామభద్రుఁడేడి
కాలవశమునుబొందిరి గాదె యధిప!॥ 106

వ॥ కావున నిట్టిదేహంబుకొఱకు రాజవధంబు సేయనేటికి శాం తింబొందు" మని చెప్పి నారదుండు స్వేచ్ఛాగతింజనియె నంత॥ 107

తే॥ సింధునాధుండు భంగంబుఁజెందెఁ గుంత
లుండు తగఁ జిక్కుపడె మాగధుండు హరిని
వినుతులొనరించె నడి మత్స్యవిభుఁడు వనము
ధామముగనిల్చె భూపాలుధాటికులికి॥ 108

తే॥ అతనిశరపాళికగపడినట్టివారు
నగపడనివారు తగ నిలింపాప్తిగోనిరి
అతనిపదగతిగనినవా రతులలీలఁ
గననివారు నరేంద్రులై ఘనతమనిరి॥ 109

వ॥ మఱియును, 110

సీ॥ కొందఱుభూపాలకుంజరుల్ భీతిచే
రంజిల్ల నమ్రశిరస్కు లైరి
సిగ్గునంబాఱి రాట్సింహులుకొందఱు
శైలకందరనివాసములమనిరి
హర్షముల్ విడిచి రాజర్షభుల్ కొందఱు
గాంభీర్యమునం దృణగ్రాహు లైరి
రూఢిగా నృపతిశార్దూలురుకొందఱు
కాంతారచయములం గలసిచనిరి

మఱియుంగొందఱురాజులు మణివిచిత్ర
పేటికాకోటికా సవఘాటికాతి
ధాటికాఘోటికాస్వర్ణశాటికాదు
లుచితముగనిచ్చి వైభవయుక్తు లైరి॥ 111

వ॥ మఱియుం గొందఱు ధాత్రీసుత్రాములు తమతమభూములు
గీములు వదలి యత్యంతసౌందర్యాభిరామలగు రాములంగూడి చనిచని,

సీ॥ కుటిలనానామృగోత్కటభీమగహనముల్
శృంగారవనములభంగి మెలంగి
నటలితపంక సంకలితసరిత్తతి
కేళీసరోలీల నోలలాడి
వరకంటకాఖండ వల్లిమతల్లికల్
తూఁగుటుయ్యెలలఁగా నూఁగియూఁగి
అస్తోకతర కర్క శాయతోర్వీస్థలుల్
ప్రసవతల్పములుగాం బవ్వళించి

కాకఘూకోత్కరాద్భుతకలకలములు
బాళి శుకసూక్తులుగను వే యాలకించి
యాత్మపురములభంగి గా నమరియుండి
రవుర!ఏమనవచ్చు భూధవునిధాటి॥ 113

ఉ॥ కొందఱువానప్రస్థులై మునులఁగూడిచరించిరి మోక్షసక్తులై
కొందఱు దేవదేవు హరిఁగూర్చి తపంబులొనర్చి రున్నతిన్
కొందఱు బంధముక్తులయి కోరికఁ జెందిరి యోగనిష్ఠ సం
క్రందనసన్నిభుండగు ధరాపతికోడి వనిన్ మహీపతుల్॥ 114

మ॥ శబరీసంఘముతోడఁజెప్పుదురు రాజన్యావరోధాంబుము
ట్కబరీసంతతు లాత్మనాయకు లుదగ్రక్రోధదుర్వారులై
ప్రబలుండైన వసుంధరాధిపుసితోఁ బంతంబులం బోరిఘో
రబలోద్రేకముఁబాసి తమ్ముఁగని యారణ్యోర్వికిన్ వచ్చుటల్॥

వ॥ మఱియు క్షోణీకాంతులుకొందఱు నిజకాంతలంబాసి కాంతారమ్ములు నిశాంతమ్ములుగానెలంగుచు నితాంతదురంతలతాంతకుంతసంఘాతఘాతజాతవిభ్రాంతస్వాంతులై॥ 116

సీ॥ కొదమరాసింగమ్ము లెదురుగాఁజనుదేరఁ
దరుణులమధ్యముల్ దలఁచితలఁచి
తెలిదమ్మికొలఁకులఁ గలువరేకులఁజూచి
లలనలకన్నులు దలఁచితలఁచి
కపురంపుటనటులు ఘుమ్ముననాసింపఁ
జెలులమైతావులుదలఁచితలఁచి
గుజ్జులేమావుల క్రొంజిగురులఁగాంచి
మెలఁతలచేతులు దలఁచితలఁచి
కలికిచిలుకలకులకంబు కానఁబడిన
జలజనేత్రలపలుకులు దలఁచితలఁచి
యవనినాయకు లాత్మకాంతాతివిరహ
పూర్ణితాత్యంతదుఃఖులై పొరలిపొరలి॥ 117

వ॥ మఱియు బాలరసాలసాలసరసకిసలయవిసరగ్రసనాకుంఠితకలకంఠకంఠకుహరగళత్పంచమకుహూకారకోలాహలకూజితప్రమోహాక్రాంతవిరహిస్వాంతంబులగు వసంతంబులును సంధ్యాకాలసల్లలితోత్ఫుల్లాత్ఫుల్లకమల్లికాప్రసూనసారసారభాత్యంతభీష్మంబులగు గ్రీ

ష్పంబులును సానుమత్కూటతటపటునటన్నీలకంఠకామినీయూథా నూనగానారవసంపూరిత దశదిశాంతరాళంబులగు ప్రావృట్కాలంబులును జీవంజీవసంజాతాజవంజవసంజీవకమంజులరుచిపిచండిలాఖండపుండరీకరిపుమండలప్రభూతకాశసరిత్కాశప్రతీకాశసాంద్రచంద్రికానిచయంబులగు శరత్సమయంబులును గడపుచు నిందిరానందనేందిందిరేందీవరమిత్రచైత్రమందానిలమరాళమయూరకీరశారికాకలకంఠప్రముఖామిత్రపక్షంబు నిందింపుచు నుండి రివ్విధంబున॥ 118

కం॥ శ్రీకరమై దిగ్భావర। భీకరమై యఖిలవిబుధబృందవినుతభా
గ్యాకరమై భూస్థలి న। స్తోకత నృపుదండయాత్ర శోభిల్లె వడిన్॥

శంతనుఁడు దిగ్విజయముచేసి మరలి పురంబునకువచ్చుట.

క॥ నాకేశనిభుఁడు రాజా। నీకములిడుకానుకలు వినిర్మలమతియై
కైకొని యాహవవిజయ। శ్రీకైకొనిమరలెఁ దనదు సేనలుగొల్వన్॥

వ॥ ఇట్లుమరలియేతెంచి నిజపురంబగు గజపురోపకంఠంబున నిలిచి పట్టణాలంకరణాది శుభోచితక్రియలొనర్ప సమాత్యులకుం జెప్పిపుచ్చిన వారలు తదాజ్ఞ శిరంబుననిడుకొని పురంబుచాటించినఁ బౌరజనంబులు॥ 121

ఉ॥ రచ్చలు వీధు లంగడులు రాజగృహంబులు నర్మహర్మ్యముల్
మెచ్చులుగుల్కు వేదికలు మిద్దెలు చప్పరముల్ కురుంజులున్
హెచ్చగుచావడుల్ విశదమేర్పడఁగానొనరించి యిచ్చమై
నచ్చపుఁబచ్చకప్రమున నల్కి యొనర్చిరి రంగవల్లికల్॥ 122

వ॥ వెండియుఁ దత్పుటభేదనప్రకాండంబు నానావిధవిచిత్రంబులు నెరయమెఱయ జంభారికుంభీంద్రకుంభశుంభత్పయోధరల యొరపుగలిగి మెఱుఁగులుపరఁగుచిఱుతొడలవడుపున బెడఁగుగలకడవన్నె పసిఁడియనఁటికంబంబులు డంబుమీఱఁగెలంకులఁబొంకంబుగా నలంకరించి సమంచితహరిత్ప్రభావిభాసమానరుచిరమరకతమణిగణపరికల్పితానల్పకళ్యాణకారణంబులగు తోరణంబులుగట్టి భూమిభృద్భిదుపలనీలకబరీభారల కపోలఫలకంబులపొలుపుతెలుపుచు......తళుకులుచిలుకు

మగరాలనిలువుటద్దంబులఁ నిల్పించి కుందరదనల సుందరమందహాస కందళంబుల కెత్తువత్తుమను బిత్తరంపుఁ గొత్తము త్తియమ్ముల నత్తు దరిసర్వతోభదరి నాగబంధఛతిపద్మగుచ్ఛశంఖచక్రగోమూత్రికాది నానావిధచిహ్నితంబులగు రంగవల్లికలుదీర్చినం బొలుపొందు ప్రతిగృహద్వారంబులవలనను బహువిభాకరప్రభాకరబింబవిభ్రమకృచ్ఛాతకుంభకుంభప్రశస్తనిస్తులశశికాంతశచీకాంతనీలకీలితానర్ఘభర్మహర్మ్యోత్తుంగశృంగభాగభాగనర్ఘమణిపాంచాలికాసంచయంబులవలనను బురలక్ష్మీ ప్రతిభుగరినగరీనగరాట్సౌధరాతిలకంబులసాహాయ్యంబునకుఁ గరంబులెత్తి చీరుతెఱంగున నభ్రంకషరత్నగోపురంబులనొప్పారు నూతన కేతనంబులవలనను బంధురపరిమళమిళితమృగమదసంకుమదచందనపంకంబులనొప్పుగల పూగుత్తులచొప్పుదెప్పనిబ్బరంపుగబ్బిసిబ్బెపుగుబ్బలజొబ్బిలమొత్తిమేఘమండలంబుపొందుఁబాసి వసుంధరకుంజనుదెంచినతొలకరిమెఱుపులయొరపునఁ జెఱకువింటిదొరయొఱఁబెఱికి కఱకుపదనిడిమెఱపించినమెఱయు నగవిరిములుకులచెలువునఁ బుడమినడుగిడి నడువనేర్చిన మాణిక్యపుబొమ్మలవిధంబున లోకంబుల మోహపఱుప నలువ చెలువపంచిన మోహినీదేవతలరీతుల నగణ్యలావణ్యతారుణ్యచాతుర్యధుర్యలయికనుపట్టు వారవిలాసవతులవలనను ముక్తాఫలాక్షత ప్రసూనంబులు మాణిక్యదీపకళికలు పసిండిపళ్ళెరంబులనిడికొని మందస్మితసుందరవదనారవిందంబులతోఁ జెలంగు పుణ్యాంగనాజనంబుల వలనను భేరీమృదంగపటహాతమ్మటడిండిమఢక్కాది బహువిధానవద్య హృద్యవాద్యఘోషంబులవలనను నత్యంతమనోహరంబై యొప్పె నప్పుడు, 123

ఉ॥ పౌరులు మంత్రులుఁ బుధులు బంధుజనంబులు మిత్రకోటియుఁ
నూరిజనమ్ము తన్నుఁగని శోభనలీలలఁ గానుకల్ తగఁ
బోరునసీయఁ గైకొని ప్రపూర్ణసుధాకరసాంద్రచంద్రికా
పారపటీరహీరసితసౌధతలంబుల నిల్చి వేడ్కతో
నారులుగ్రొత్తముత్తెములు నవ్యసుమంబులు సేసఁజల్లగాఁ ॥ 124

కొనుము దేవేజ్య" యన భక్తి గురుఁడు హరుని
నుతులొనర్చెను వేదార్థగతులఁ దొరయ॥ 85

వ॥ "శివ! సోమ! సపుత్రకత్రిశూలి! ప్రధానపురుషేశ్వర! సర్గస్థిత్యంతహేతుక! సర్వజ్ఞ! వరేణ్య! శంకర! ఆర్తిహారి! వేదాంతవేద్య! చిన్మాత్రరూప! మహాత్మ! దేవదేవ! దేవ! విశ్వేశ్వరా! నీకొఱకు నమస్కారంబు, ఋతంబును సత్యంబును బరబ్రహ్మంబును బురుషుండును గృష్ణపింగళుండును నూర్ధ్వరేతస్కుండును విరూపాక్షుండును విశ్వరూపకుండును ననం దేజరిల్లు నిన్నుఁ గూర్చి నమస్కరించెద, విశ్వుండవును విశ్వాధికుండవును రుద్రుండవును విశ్వస్వరూపకుండవును వృషభధ్వజుండవును సత్యవిజ్ఞానుండవును హృదయాకాశ మధ్యగుండవును నగు నిన్ననేకనమస్కృతుల నారాధించెద, చంద్రసూర్యేంద్రవహ్నియమనిరృతివరుణవాయ్వర్థపరుద్రసంజ్ఞుండ వీవ, మహేశ్వరా! స్థూలమూర్తిచే వ్యాప్తంబయ్యె నీజగంబు! నీప్రసాదలేశంబున దేవతులు దేవత్వంబునొందిరి. మహేశాన! సర్వజ్ఞ! అపరాజిత! దిగ్వాస! అంబికాపతి! ఉమాపతి! ఈశాన! ఓంకారాంత! మాయాతీత! కారణకారణ! మంగళమంగళాత్మక! వేదవిన్మనీష్యుపాసనీయ! నీకొఱకనేకనమస్కారములు గావించెద" 86

• నాడీచక్రప్రశంస •

తే॥ ఇట్లు వినుతించు గీష్పతి కీశ్వరుండు
వలికె "దేవేజ్య! గురుభక్తి గలిగి మిగుల
శ్రద్ధ చేవిను నాడికాచక్రమహిమ
దేహమర్మంబు దెలియును దీన నీకు॥ 87

సీ॥ నరులకు దేహంబు పరఁగ స్వాంగుళిచేత
షణ్ణవత్యంగుళీసంఖ్య నొప్పు
తనుమధ్యమున శిఖిస్థానంబు చెలువారు
హేమకాంతిఁ ద్రికోణనామమునను

మేఢ్రంబు క్రిందుగా మీఁద గుదంబుగా
రెండంగుళంబుల నుండు దేహ
మధ్యమస్థానంబు మానవశ్రేణికి,
ఆధారమునకు నవాంగుళముల
కవలఁ జతురంగుళాయామమగుచుఁ గంద
మమరునొక్కటి కుక్కుటాండాభమగుచు
దానిమధ్యంబె నాభిగాఁ దత్త్వవిదులు
పలుకుదురు, దానిమధ్యగాఁ బరఁగునాడి॥ 88

క॥ దానిసుషుమ్నాభిధమని। మానులుపల్కుదురు, దానిమానక చుట్టుం
బూనిక డెబ్బదిరెండగు। మానితసాహస్రకముల మలయునునాడుల్॥

తే॥ వానిలోపలఁ బదునాల్గు వన్నెకెక్కు
అందులో మూడు ఘనములై యతిశయిల్లె
నిడ సుషుమ్నయుఁ బింగళ, యివియుఁగాక
తక్కుపదొకండునాడులు తనరవినుము॥ 90

వ॥ సరస్వతి పూష వారుణి హస్తిజిహ్వ యశశ్వని విశ్వోదర కుహువు శంఖిని పయస్విని యలంబుస గాంధారి యను సంజ్ఞలుగలిగి యుండు, ఇందు ముఖ్యనాడియగు సుషుమ్న పృష్ఠమధ్యంబున వీణా దండంబునుంబోలి వసించు, నాభికందంబుక్రిందుగ అష్టప్రకృతిరూపయై యథావద్వాయుచేష్టయగు కుండలీశక్తి జీవనాడినిరోధించి క్రిందిపార్శ్వంబుగాఁ బ్రవేశించి స్వముఖంబున బ్రహ్మరంధ్రంబు వేష్టించి వసించు, సుషుమ్నకు సవ్యదక్షిణంబుల నిడాపింగళలుండు, సరస్వతీకుహువులు సుషుమ్న పార్శ్వంబులఁ బ్రవర్తించు, గాంధారీహస్తిజిహ్వలిడాపూర్వపూర్వంబుల నుండు, పూషాయశస్వినులుపింగళ పృష్ఠపూర్వంబులవసించు, కుహూహస్తిజిహ్వలనడుమ విశ్వోదరాఖ్యనిల్చు, యశస్వనీకుహులమధ్యంబున వారుణివసించు, పూషాసరస్వతులనడు యశస్వినినిల్చు, గాంధారీసరస్వతీమధ్యంబున శంఖినివసించు, పాయు

(పర్యంతము) కందమధ్యంబుగా నలంబుసయుండు, సుషుమ్న పూర్వభాగంబున మేఢ్రాంతంబుఁ గుహూనాడివసించు, ఊర్ధ్వాధోదేశంబుల సర్వగామియగు వారుణివిరాజిల్లు, ఇడాపింగళలు దక్షిణవామనాసాంతముఁ వ్యాపించు, (యశస్విని) యామ్యపాదాంగుష్ఠాంతము నొందు, పూషయామ్యాక్షిపర్యంతము పింగళాపృష్ఠభాగంబుగా (నుండు, యశస్విని) యామ్యకర్ణాంతంబు నొందు, సరస్వతి యూర్ధ్వగమై జిహ్వ(పర్యంతము వర్తించు)హస్తిజిహ్వ సవ్యపాదాంగుష్ఠాంతంబు నొందు, శంఖిని సవ్యకర్ణాంతగయగు, గాంధారి సవ్యనేత్రాంతగయగు (విశ్వోదరకందమధ్యంబుననుండు,) ఇట్లునాడీచక్రంబునందుఁ బ్రాణాది వాయుపంచకంబు, (నాగాద్యుపవాయుపంచకంబు) సంచరింపుచుండు, అందుఁ బ్రాణా(దిపంచక)ం బుత్తమంబు, (వానిలోఁ బ్రాణాపానంబులుత్తమంబులు) అందుఁబ్రాణంబు ముఖనాసికా (మధ్యంబునను) నాభి (మధ్యంబునను) హృదయంబునను నిత్యంబు వర్తించుచుండు, అపానంబు గుదమేఢ్రో(రుసంధులయందును నుదరవృషణ) జంఘుకటినాభిస్థలంబుల(ందును)నిత్యంబువసియించు, వ్యానంబు శ్రోత్రాక్షిమధ్యంబునను గృ (కాట్యంగుష్ఠముల)ను ఘ్రాణస్థానంబునను (గుదస్థానంబునను)వసించు,ఉదానంబు (హస్తపాదములయొక్క)సర్వసంధులయందును సమానంబు సర్వదేహంబునందును వ్యాపించు, ఇంక నాగాదివాయువులుద్గారోన్మీలనాదికృత్యంబు లాచరించుచుండు, (సుషుమ్నకు శివుండును నిడకు హరియును బింగళకు విరించియు సరస్వతికి విరాట్టును) పూషకగ్నియును వరుణకు వాయువును హస్తిజిహ్వకు వరుణుండును యశస్వినికి భాస్కరుండును నలంబుసకు వరుణుండును గుహూకు భూమియును గాంధారి (శంఖినులకుఁ) జంద్రుండును యశస్వినికిఁ బ్రజాపతియును విశ్వోదరకుఁ బావకుండును నధిపతులయియుండురు. పింగళనుండి వాయు విడానాడి కరుగునెడ నుత్తరాయణంబగు, ఇడనుండి పింగళకు వాయువరుగునెడ దక్షిణాయనంబగు,ఇడాపింగళలనడుమకు

ప్రాణంబు తా నది దేహంబునం దమావాస్యయగు, ప్రాణంబు మూలా
ధారంబునకరిగిన నది యాద్యంబైన విషువంబగు, ప్రాణంబు మూర్ధగ
తంబైన నది యంత్యంబైనవిషువంబగు, ఉశ్వాసనిశ్వాస (సంబంతయు
మాససంక్రమణంబగు) ప్రాణం బిడానాడివలనఁ గుండలీస్థానంబు జేరిన
నది చంద్రగ్రహణంబనంబడు, ప్రాణంబు పింగళవలనఁగుండలీస్థానంబుఁ
జేరిన నది సూర్యగ్రహణంబనంబడు, మఱియును, 91

సీ॥ శీర్షాగ్రభాగంబు శ్రీశైలమననొప్పు
ఫాలంబు కేదారపదము దలఁప
భ్రూమధ్యము(నకును బొసఁగు ఘ్రాణమునకు
మధ్యమస్థానంబు మహితకాశి
అగును గురుక్షేత్ర మనఘ! కుచస్థాన)
మలచిదంబరము హృదంతరంబు
ఆధారికము కమలాలయస్థానంబు,
అగుఁబ్రయాగము హృదయాంబుజంబు
దలఁప నియ్యాత్మతీర్థముల్ దొలఁగి యన్య
తీర్థములకేగుచుల్లను దెలివిదప్పి
కరగతంబగురత్నంబు ధరణివైచి
కాచ మాకాంక్షఁ జేసెడి క్రమముగాదె॥ 92

తే॥ పొలఁతి దాఁ బుత్రికాబుద్ధిఁ బుత్రియయ్యె
భార్యయనుబుద్ధిభావింప భార్యయయ్యె
అట్ల జలములు నుపలంబు లరసిచూడ
భావమునఁగాదె తీర్థదైవంబులయ్యె॥ 93

తే॥ బాహ్యతీర్థంబుకన్నను బరమమైన
భావతీర్థంబె తీర్థంబు, పరమమునులు
దీనిమన్నింతు రాత్మల మానితిలక!
సర్వకర్మప్రమాణంబు సత్యముగను॥ 94

సీ॥ భావశుద్ధత లేక బాహ్యతీర్థంబులఁ
బరిశుద్ధిగలుగదు, బహుళనదుల
మధ్య భాండముముంప మఱి శుద్ధిగలుగునే
గ్రహణకాలమునందు గంగలోనఁ
బూనిమున్గుటకన్న జ్ఞానయోగుల పాద
జలములమున్గినఁ గలుగుఫలము
తీర్థతపోయాగకృపదాళి దేవతా
బుద్ధిగల్గును మూఢబుద్ధులకును
స్వాత్మయందును సకలభూతాళియందు
నీశుఁడుండఁగ విజ్ఞానదృష్టి లేమి
మూఢులెఱుఁగరు మాయావిమోహితాత్మ
లగుచు మాయాప్రభావ మేమనఁగవచ్చు॥ 95

తే॥ లోన శివమూర్తిఁ జూడక పూని బయలఁ
జూడఁగోరుట కరగత స్థూలపిండ
మవని పైవైచి కూర్పరం బమర నాకఁ
గోరు మూఢాత్మకరణి యుదారచరిత॥ 96

క॥ చిత్తంబున యోగీంద్రులు
చిత్తజహరుఁ జూతు రజ్ఞచిత్తంబులకున్
దత్త్వజ్ఞానము లేమిని
నుత్తమగతిఁ బ్రతిమ లవని నుచితములయ్యెన్॥ 97

మ॥ సకలవ్యాపకమై పరాత్పరమునై సత్యంబునై యద్వయ
ప్రకటంబౌచుఁ బ్రధానమై నిజసుఖప్రాశస్త్యమౌ బ్రహ్మమే
యకలంకాత్ముఁడుచూచు వాఁడె కను నన్యాసాధ్యమౌనట్టిదే
శికపూర్వానుభవైకసాధ్య మది చర్చింపంగరా దేరికిన్॥ 98

తే॥ సర్వభూతాంతరస్థుని సర్వమయుని
శుద్ధవిజ్ఞానదేహుని సులభు నాత్మ

లోన (జూడకపరమా)త్మఁ బూని (బైటఁ)
జూచి (నం జూడనట్టులే) చోద్యముగను॥ 99

వ॥ మఱియు, 100

చ॥ అగణితలీల నాత్మఁ దనయందె కనుఁగొన కన్యదైవముల్
దగభజియించువాఁడు పరతత్త్వమెఱుంగ(నియట్టివాఁడుతా)
నగునని వేదముల్ వలుకు నార్యజనోత్తమ! నాడిపుంజన్మై
తగునరభావముల్ విడిచి తత్త్వగతిన్ నినునీవ చూడుమీ॥ 101

చ॥ (గణనకుమించివర్తిలెడి కాయసుల౯ దశగిరతా సుల
క్షణమునఁ గాల్చునాత్మ విభు సమ్మదరూపు మనంబున౯ స)మీ
క్షణమొనరించుధీరుఁ డొకకాలము శోకమునొందఁడెందు, స
ద్గణనుతు సమ్మహాత్మఁ గనఁగల్గినఁ గల్గు ననూనపుణ్యముల్॥ 102

తే॥ జ్ఞానమున భేదకారణాజ్ఞానమణఁగ
నాత్మకును బ్రహ్మకును భేదమను దురుక్తిఁ
బల్కనెవ్వఁడు(దీని) నేర్పడఁగనీకు
సర్వమును దెల్పినాఁడను(సంగ్రహా)ముగ"॥ 103

వ॥ అని మహేశ్వరుండు సురేశ్వరాచార్యుంజూచి "నీవును న
శ్వరంబైన దేహంబునం దహంభావంబు విడిచినినునీవు కనుంగొను"మని
ననతండునుభక్తి పరవశుండగుచు నంబికాపతియును నద్భుతుండును
నగు నమ్మహాదేవు నిట్లనిస్తుతియించె, 104

సీ॥ "జయదేవ! జయపూర్ణ! జయపరానందాత్మ!
జయసత్యచిద్రూప! జయసురూప!
జయమహాసంసారచటులరోగాపహా!
జయ పాతకవినాశ! జయసురేశ!
జయమహాదేవ! వాచాగోచరాకార!
జయదైత్యమదహారి! జయపురారి!
జయమహాహంకారశత్రుఘ్న! కల్యాణ!
జయమహామాయాఘ్న! జయమఘఘ్న!

జయవిమోహహరశ్రేష్ఠ! సాంబ! యసమ!
దేవవిద్వేషిహర! శివ! దీనసులభ!
జయవిరించిముఖార్చిత! సర్వజనక!
వేదవేదాంత్యవేద్య! సంవిత్ప్రకాశ!॥ 105

క॥ జయజయవిద్యానాయక!
జయజయవిద్యాప్రధాన! జయభస్మభవా!
జయజయ (కరుణావిగ్రహా!)
జయజయ (యహిభూషితాచ్ఛ) సర్వాంగశివా!॥ 106

క॥ జయభోగామృతదాయక!
జయబ్రహ్మవిదర్చనీయ! జయభూతిధరా!
జయభస్మ (రతజనార్తిహా)
జయయోగిమనోనివాస! జయ (కామహరా")॥ 107

తే॥ ఇట్లువినుతించిగురుఁడు దేవేశ్వరేశు
పాదయుగళికిమ్రొక్కి సద్భక్తిగరిమ
దనర నక్లేశుఁడై కృతార్థతవహించి
పరవశత్వంబునొందె నాదరముగదుర"॥ 108

సీ॥ అనిచెప్పిసూతుఁడు మునులతోనిట్లను
"నిమ్మహాస్తవరాజ మెవ్వఁడుభయ
సంధ్యల భక్తిచే, జదువు, నాజనునకు
గంగాప్రవాహంబుకరణి వాగ్వి
భూతి విజృంభించు, బుద్ధివి గురుసితో
గురుభక్తి నాతోడ సరివహించు
పుత్రార్థి పుత్రులఁ బుత్ర్యర్థి పుత్రిని
బ్రహ్మవర్చసకామి బ్రహ్మతేజ
మెలమిఁగాంచును, మీరును జలనరహిత
బుద్ధి సంధ్యాద్వయంబున భూరిభక్తి

కలితసద్వ్రత్తిఁ బఱియింపఁ గలుగునెపుడు
మానితేష్టఫలంబులు మానులార!"॥ 109

• నాడీశుద్ధి •

వ॥ అనియిట్లుసూతుండు శౌనకాదులకు నాడీచక్ర నిర్ణయం
బెఱింగించి నాడీశుద్ధిప్రకారం బిట్లనియె, 110

సీ॥ "విధ్యుక్తకర్మఁడై వెసఁ గామసంకల్ప
(శూన్యుఁడై) యష్టాంగ (శుద్ధ) యోగ
రతి శాంతసత్యపరాయణాత్తస్థితి
జెలఁగ సద్దేశికశిక్షగలిగి
గిరిశృంగవననదీవరబిల్వవాటికా
స్థలి మనోహరశుచిశాలయందు
వేదఘోషంబులు వెలయఁగా ఫలమూల
కలితమౌ చోట నిశ్చలతనిలిచి

సర్వరక్షాసమగ్ర తత్స్థలమునందు
శ్రద్ధధానతఁ ద్రిషవణస్నాతయగుచు)
నగ్నిహోత్రజ(మౌ)విరజానలాభి
జాత(మైన)భస్మ(ంబు చేతదాఁల్చి)॥ 111

తే॥ అగ్నిరిత్యాదిమంత్రాళి నధికమగుచుఁ
దనరు జాబాలిసప్తమంత్రములచేత
సుమహితాథర్వమంత్రషట్కము(న సరిగ)
మంత్రితంబుగఁ జేసి సమ్మదముగదుర॥ 112

క॥ శిరమున నురమునఁ గరములఁ
గరమర్థిని బాహుమూలకములను భస్మ
స్ఫురితత్రిపుండ్రరేఖలు
ధరియింపఁగవలయు భక్తిఁ దలఁచుచు శివునిన్॥ 113

ఇదియునుంగాక సందంశన్యాయముచేఁగూడ దేవపూజ తచ్ఛ్రోత్రక పూర్వోత్తరోక్త సంధ్యాస్నానాతిథ్యవైశ్వదేవాది కర్మాధికారుల నదలి యన్యులంబొందలేదు. మధ్య రెంటికిని సంబాధించియున్నప్పుడు సందంశన్యాయమందురు. పాంచరాత్రాద్యాగమములందుఁజెప్పుటవలన దేవపూజ యశాస్త్రీయమని చెప్పుట కేవల సాహసమే కాదు. శాస్త్రార్థసంప్రదాయాపరిజ్ఞానమును. పాంచరాత్రాద్యాగమములుకూడ వేదవిరుద్ధము కాని యంశములలోఁ బ్రమాణములని శిష్టులచే నంగీకరింపఁబడినవి. తైత్తిరీయోపనిషత్తు నారాయణములోని, శ్రు॥ తత్పురుషాయ విద్మహే, మహాదేవాయ, ధీమహి, మొదలుగాఁగలవాక్యములకు విద్యారణ్యులవారు పాశుపతాద్యాగమములనుదాహరించి తత్తదాగమప్రసిద్ధుఁడైన రుద్రుని బ్రార్థించుచున్నాఁడనియు విఘ్నేశ్వరుని బ్రార్థించుచున్నాఁడనియు దుర్గను బ్రార్థించుచున్నాఁడనియు విష్ణుని బ్రార్థించుచున్నాఁడనియు వ్రాయుచు శైవాద్యాగమములందుఁజెప్పఁబడినయంశములలో శ్రుతిసమ్మతియున్నట్లు సూచన చేసిరి. ఈయుదాహరించిన శ్రుతివాక్యములలోనే రుద్రవిఘ్నేశదుర్గావిష్ణ్వాదిత్యుల ప్రార్థనయుండుటవలన "ఆదిత్యమంబికాంవిష్ణుం గణనాథంమహేశ్వరం" అనుశ్లోకములోఁజెప్పఁబడినపంచదేవతారాధన శ్రుతిసమ్మతమని చెప్పుట కెంత మాత్రము సందేహము లేదు. అక్కడనధికముగాఁజెప్పఁబడినను "అధికంప్రవిష్టం నతద్ధానిః" అనున్యాయముచేఁ బైని వ్రాయఁబడిన స్మృతిలోఁజెప్పబడిన పంచదేవతారాధనకు బాధలేను. కావలసియున్న వానికన్న నధికమున్నప్పుడు కావలసినవానికి లోపములేకపోవుటే యీన్యాయమున కర్థము. ఏఁబదిరూపాయలు కావలసివచ్చినప్పుడు నూఱురూపాయలున్న నేఁబదింటికి హానివచ్చునా? దీనినే శతే పంచాశన్యాయమనికూడఁ గొందఱు చెప్పుదురు. ఈలాగుననే యుత్తరమీమాంస రెండవయధ్యాయము మొదటిపాదములో "ఏతేనయోగః ప్రత్యుక్తః" అనుసూత్రముయొక్క భాష్యమందు వేదమునకువిరుద్ధముగాని యంశములలో సాంఖ్యయోగశాస్త్రములప్రామాణ్యముకూడ నిష్టమేయని

శంకరాచార్యులవారిచే వ్రాయఁబడియున్నది. వేదవిరుద్ధాంశమును బట్టి యోగశాస్త్రము మీమాంసాసూత్రముచే నిరాకరింపఁబడినది. ఈలాగుననే యీయధ్యాయములోనే ద్వితీయపాదమందు "ఉత్పత్త్యసంభవాత్" అనుసూత్రముయొక్క భాష్యమందుఁగూడఁ బాశుపతపాంచరాత్రాద్యాగమముల నిరాకరించు సమయములో నద్వైతసిద్ధాంతమందు వలెనే పాశుపతపాంచరాత్రాద్యాగమములందును నీశ్వరుఁడే జగత్తున కుపాదానకారణమును నిమిత్తకారణమును నని యంగీకరించియుండఁగా నీమతము నేలనిరాకరింపవలెనని శంకించుకొని శ్రుతికివిరుద్ధము లుగాని యీ చెప్పఁబడినయంశములందును బరమేశ్వరుఁడే నానారూపములుగానుండునను నంశమందును దేవతాగృహగమనము దేవతాపూజ మొదలైన యంశములందును శ్రుతిసమ్మతియుండుటవలన నాయాగమములుకూడఁ బ్రమాణములనుట మాకిష్టమే యను నభిప్రాయముతో శంకరాచార్యులవారు వ్రాసి యందులకుఁ బ్రమాణముగాఁ గొన్నిశ్రుతిస్మృతివాక్యముల నుదాహరించిరి. భగవంతుని గుఱించిన యభిగమనోపాదానేజ్యాస్వాధ్యాయయోగాదులు శ్రుతుల యందు నిషేధింపఁబడకపోవుటవలన నాగమాదులుకూడఁ బ్రమాణములని వారియభిప్రాయము. అభిగమనమనఁగా నియమితవాక్కాయమనస్సులతో దేవతాగృహమునుగుఱించి వెళ్ళుటయనియు నుపాదానమనఁగాఁ బూజాద్రవ్యముల సంపాదించుటయనియు నిజ్యయనఁగాఁ బూజించుటయనియు స్వాధ్యాయమనఁగా నష్టాక్షర్యాదిమంత్రముల జపించుటయనియు యోగమనఁగాఁ బరమేశ్వరుని ధ్యానించుటయనియు శుద్ధుఁడును జ్ఞానస్వరూపుఁడును నగు పరమేశ్వరుఁ డొక్కఁడే వాస్తవమైనవాఁడనియు నట్టిపరమేశ్వరుఁడొక్కఁడే నానారూపములుగా నుండుచున్నాఁడనియు నక్కడ భాష్యటీకలయందు వ్రాయఁబడియున్నది. అందువలన సచ్చిదానందస్వరూపమైనబ్రహ్మమే బహురూపములుగానుండుటయనునది శ్రుతిమూలకమేయని నిశ్చయపడుచున్నది. ఇట్లుభేదమును బూజాదికమును శ్రుతిమూలకమగుటచే నాయంశముల

యం దాగమములయొక్క ప్రామాణ్య మాచార్యులచే స్వీకరింపఁ బడుటవలన నశాస్త్రీయమని చెప్పుట యజ్ఞానవిలసితము కాదా? ఈ చెప్పుటచే నిర్వికారమైన బ్రహ్మమునకు సవికారత్వ మెట్లుసంభవించుననను మొదలగు మందాధికారుల కుయుక్తులు నిరాకరింపఁబడినవని తెలిసికోవలయును. "శ్లో॥ ఉపాసకానాంకార్యార్థం బ్రహ్మణోరూపకల్పనా" మొదలగు శాస్త్రములయొక్క ప్రామాణ్యమువలన సర్వము ఁ గుగురవచ్చును. ఉపాసకులయిష్టసిద్ధికొఱకై బ్రహ్మకు నానారూపకల్పనమౌనని పైవాక్యము యొక్క తాత్పర్యము. అందువలన సంధ్యాస్నానమును పరాశరస్మృతిశ్లోకములో బ్రాహ్మణబ్రువాచార గంధమైనను లేదు. అటులఁ దాత్పర్యము చెప్పుటకు వారి జన్మాంతరీయమైనసంస్కార గంధమే కారణమని సత్పురుషులు తెలిసికొందురుగాక. పంచాయతన పూజ యెవరో యొకఋషికి సమ్మతమైనను సర్వజనాదరణీయము కాదనునుక్తి తుచ్ఛమైనది. ఒక్కొకఋషికిసమ్మతమైన ధర్మమైనను నవశ్యాదరణీయము. ఈరీతి శాస్త్రము వాకొనుచున్నది. శ్రు॥ సత్యమితి సత్యవచా రాథీతరః, తపఇతి తపోనిత్యః పౌరుశిష్టిః, స్వాధ్యాయప్రవచనేవవేతి నాకోమౌద్గల్యః, ఇత్యాదు లొక్కొకఋషిసమ్మతములైనను గ్రాహ్యములౌచున్నయవి. ఏకసమ్మతము సర్వాంగీకార్యము కానిచో నీయాఋషిమతములుకూడ ననాదరణీయములే కావలసివచ్చును. ఇట్లు "సత్యంపరగ్ంసత్యం" ఇత్యాదిశ్రుతులలో మతభేదముచేఁ జెప్పఁబడిన సత్యతపోదమాదులుపదునొకొండునుజ్ఞానసాధనములగుచున్నవి. సర్వర్షిసమ్మతమైనధర్మ మొక్కటియుం గన్పట్టదు. అంతమాత్రముచే ఋషులకుఁ బరస్పరవైషమ్యాదికము శంకింపఁదగినది కాదు. భిన్నభిన్న ధర్మప్రతిపాదకులగు ఋషులహృదయ మధికారిభేదమునుసరించియే కావునఁ దద్ధర్మములకుఁ బరస్పరనిషేధ మొంతమాత్రము లేదు. పరాశరులంగూర్చిన వ్యాసాదిఋషిప్రశ్నము కలియుగమందేర్పడఁబోయెడి యనాచారములఁగూర్చి కాదు కావునఁ బరాశరులవారు కలియుగమున నిట్టి యవైదికాచారప్రవృత్తి బహుళమగునని ఋషులకు

దెలుపుటకై దేవతానాంచపూజన మని వ్రాసినారను నుక్తి దురుక్తియగుటకు నిర్వివాదము. పరాశరులవారిహృదయ మిట్టిదని శ్రీ కామశాస్త్రిగా రెట్లు తెలిసికొనఁగలిగిరోకదా! పూజకులయందో పూజ్యులయందో కలిగినద్వేషమే యిట్లుపల్కించియుండును. కానిచో నేతాదృగ్భావగ్రహణ మెట్లుసంఘటించును. దేవపూజ యనాచారపరులగు బ్రాహ్మణబ్రువుల యాచారములలోనిదని యే పరాశరులయభిప్రాయ మనుకొందము. అట్లైనప్పుడో తద్వాచకశబ్దములనే ప్రయోగింపక వ్యామోహాపెట్టెడి వక్రోక్తులచే లోకులను భ్రష్టులఁజేసియుండఁడు. పరోపకారశీలురకీలాటికుటిలరీతి తగినదికాదు. కలియుగమున దేవపూజ చేయఁగూడదని స్పష్టముగనేచెప్పుట ధర్మమైయుండును. ఇట్టిగూఢాభిప్రాయ మెల్లరులకు దెల్లమగునదికాదు. ఎచ్చటను జెప్పఁబడనియర్థ మూహించుటకందఱును శాస్త్రిగారివంటివారు కావలెంగదా! ఇట్లే భగవద్గీతాచతుర్థాధ్యాయమున "కర్మణ్యకర్మయఃపశ్యేత్" అనుశ్లోకముయొక్క వృత్తికారవ్యాఖ్యానములో శంకరాచార్యులచే స్వారస్యము నివేదింపఁబడియుండె. ఇప్పుడేని సంప్రదాయాభిజ్ఞులగు విద్వాంసులముఖమున నీసంగతులు శాస్త్రిగారు తెలిసికొందురుగాక. అందువలన స్పష్టార్థకశబ్దములవదలి పరవ్యామోహకశబ్దములచే నర్థబోధచేయుట మహర్షులపక్కియెన్నటికిఁ గాదని సంతోషింపఁగలరు. మఱియును, పంచాయతనపూజ యొకానొక ఋషిసమ్మతమైనదనునుక్తి గ్రంథమున స్వప్రయోక్తయజ్ఞానమును స్పష్టీకరించుచున్నది. అట్లుకానిచో బహుఋషిసమ్మతమగు నాపూజవిషయమై యెందుకని యిట్లువ్రాసిచ్చెడివి? ఈవిషయమునఁ గొందఱిసమ్మతి మించుక యుదాహరింపఁబడుచున్నది

శ్లో॥ రవిర్వినాయకశ్చండీ ఈశో విష్ణుస్తుపంచమః॥ అనిపద్మపురాణము, శ్లో॥ శిష్యాణాంపంచపూపాదిసదాబోధయబోధయ॥ అని రేణుకాతంత్రమున మాధవయతీంద్రునిగూర్చి లక్ష్మీసరస్వతులవచనము.

కము. ఏమైనను గొలఁదికాలములో స్వదేశమున కరుగఁదలఁచియేయున్నాను. ఇప్పుడేని సెలవులరాకకుఁ బూర్వమే స్వదేశమేగి ప్రతి సం॥మును మాతండ్రిగారితోఁ గలిసికొని పితృపితామహార్జితవసతియగు కడియము గ్రామములో నియతముగా రెండుమాసములును వసించుచుంటిని. నారాక కెప్పుడెప్పుడని యెదురుచూచు మాతండ్రిగారు నే నరుగక పూర్వమే కడియమున కాటామడలోనున్న యేనామునుండి బయలుదేరి వచ్చి నన్నుం గాంచి యానందించుచుందురు. వారు వత్సరమునకు రెండుమాసములు నాయొద్దను పదిమాసములు మాచెల్లెలియొద్దను వసించుట మాకృతఘ్నుఁ డెఱుఁగనిది కాదు, మామా సౌహార్ద మెఱుఁగనివాఁడును గాఁడు, కాని వానికిఁగల కడుపుమంటచే నెట్లెట్లో యపవదింప మొదలిడినాఁడు. ఇల్లువెల్వరించిన పుత్రునియొద్దఁ గాదుకాదు శత్రునియొద్ద వత్సరమునకు రెండుమాసములే కాదు రెండుదినములేని యేతండ్రి నివసించుటకిచ్ఛగించు నని యెవరేని చీవాట్లు పెట్టఁగలవార లుండక పోరని వాఁడనుకొని యుండఁడు. ఇంత పరిశీలన యెవరికిఁ గావలసి వచ్చుననియు, ఏమో యతఁడు పితృద్రోహి కాఁగూడదా యని దూరగులేని విశ్వసింపకపోదురా యనియుఁ దోఁచినట్లెల్ల వదర దొరఁకొనియెను. సర్వగృహమేధిసాధారణమగు నీమాత్ర మవకాశముతప్ప వాని కేవిధమైన యవకాశము గాని దొరక లేదనుటకుఁ వాఁడు వ్రాసిన దురాగతపువ్రాఁతలోని

"ఆగ్రహించి"

అన్యనిర్హేతుకాగ్రహప్రవాదకథనమే చదువరు లుదాహరణముగాఁ గైకొన వచ్చును. ఆయీఘట్టమున నెన్నాతప్పుడుఁగూఁతలకుఁ జాలఁబద్దెములు వమ్ముచేసిన సాహసికి వారిపై నాకాగ్రహ మేల రావలయునో తెలుపఁ గలకొన్ని యక్షరములు విస్తరభీతిం గలిగించెడినని యెవరనుకొందురు? ఇదిగాక యింతదురాగతము మొదట నుండియు వీని కలవడినచో నీతప్పుడువదరు లే"యప్రస్తుతప్రశంస"లోనో వదర వలసి యుండును. వీనికిని నాకును గలహమునకుఁ బూర్వమే మాతండ్రిగారు నాయొద్దనుండి స్వదేశము ప్రవేశించి యున్నారు. క్రమముగాఁ బాపము పండి కన్ను మిన్నును దెలియక పరాభవసన్నిపాతము ముదిరి యిట్టిదురాగతములకు దింపుచున్నదని పైహేతువుల వలనఁ దెలియఁదగు. అయ్యో? తప్పివచ్చెఁగదాయని వీఁడియ్యది చూచినమీఁద నేహేతువులనుగూడ నపవదింపక పోఁడు.

"అబద్ధమున కర్థమేమి, మొంగికాలికిఁ జెప్పేమి"
"నరకే సతి కోదోషో మరణేసతి కింభయమ్"

"మొండివాఁడు రాజుకన్న బలవంతుఁడు"

వీండ్రమొండితనము, వీండ్రయసత్యపాండిత్యము, వీండ్రయపత్రపాశూన్యత్వము, ఇయ్యవి మేము తెలుపనక్కఱలేదు. వీండ్ర"మహాభారతమే" సహస్రముఖముల ఘోషించెడిని. అందు నేడుపర్వములవఱకు విగ్రహారాధనపీఠిక విమర్శించినది. ఈతప్పుడుప్రసంగము దాని కిటీవల వెలువడిన 8వ పర్వమునందలిది గాన నందెక్కడయ్యె. ఏవ్రాఁత వ్రాసినను వీండ్రు సమీపస్థులు విశ్వసింతురనికాదు, కేవలము దూరగులను గిఱరించుటకే, వారుమాత్రము మూర్ఖులా? ఎవరికో వ్రాసి నిజము తెలిసికొనకుందురా? ఇట్లు శృంగభంగమునందలి తత్త్వమును దెలిసికొనినవా రెందఱులేరు. ఎంతో దూరమునందున్న కలకత్తానివాసునకు దానితత్త్వ మెంతలోఁ దెలిసినది. అట్లే యివియును

"నిజము నిడివిమీఁదఁ దెలియును"

అనులోకోక్తికి స్మారకము కాకపోదు. వ్రాసి తెలిసికొనువారు మాకృతఘ్నునికిఁ బెద్దతల్లికొమరుఁడును (ఈయనకీబాంధవ్యముతప్ప వేఱొండు కళంకము నాపాదింపవలను లేదని యెఱుఁగఁదగు) గడునుత్తముఁడును, ఏనాముపోస్టు మురుమళ్లపోలవరగ్రామనివాసియును నగు, ఆకొండి రామమూర్తిగారికిఁగాని, ధవళేశ్వరముపోస్టు మానివాసగ్రామము కడియమునందలిసంపన్నగృహస్థులలో నొకరును మాకృతఘ్నునికిఁ జాలఁగూర్చు చుట్టములును విద్యావయోవృద్ధులును నగుచామర్తి వెంకటాచలపతిగారికిఁగాని వ్రాసినచో నాపితృభక్తియు నాయెడల మాతండ్రిగారికిఁగలయనురాగసంపత్తియు వేఱువేఱు చోటుల నుండుటకుం గలకారణమును వారు తెలుపక మానరు. ఈవిషయమై మాతండ్రిగారికిఁగాని వారెక్కడనివసించుచున్నారో,ఆనాచెల్లెలిభర్తకుఁగాని వ్రాసినను దెలియనయ్యెడినిగాని యేమైనను వారు తెల్పుట యంతబలవత్తరమైన సాక్ష్యము గాదు. ఎంతయపాత్రునందైనను గొడుకుపెడలఁ దండ్రి దోష మున్నదని వ్రాయకపోవచ్చును. వ్రాయనీయకయుఁ బోవచ్చును.

"కడుపు చింపికొన్నఁ గాళ్లమీఁదఁ బడును"

అనులోకోక్తి నెఱుఁగనివా రెవరు! కావున మాకృతఘ్నుని కత్యాసన్నులగువారివలననే పైవిషయము తెలిసికొనుట వీలు, పేరెత్తిచూపినయాయిరువురకే వ్రాయవలయుననునియమముతోఁ బని లేదు, ఆగ్రామములకే యక్కఱలేదు, చుట్టుపట్లగ్రామములకేని వ్రాయనగుబందరుగ్రామమునకుఁగూడ వ్రాయవచ్చును, పూర్ణమైనహక్కులోఁ జేరిన

తండ్రి నిలువెడలఁ గొట్టవలసివచ్చినపు డద్దాని నెందతు విని యుండ వలెను; ఘుఖ ఘుఖాల నిలు వెడలి పోవుటకుఁ దండ్రి యాతిధివంటివాఁడు గాఁడుగదా

"శాంతం పాపమ్, ప్రతిహతమమంగళమ్,,

ఈవిచారణ మిటులుంచి వారిపోషణమునకు సంబంధించిన చరిత్రమునకుపోద్ఘాత ప్రాయములగు మాకృతఘ్నుని మఱికొన్ని వదరులంగూడఁ దిలకింపుఁడు

(రామకృష్ణను + మహాభారతమునుండియే)

క॥ నెలనెలకు నించుకించుక। కొలబత్తెము కొడు కొసంగఁగూ టికిని గు।డ్డలకును జాలకయాతఁడు। కలకాలము నిట్లు పాట్లు గనవల యునెకో॥

కాలనేమిచర్యాస్ఫోరకములగు పైవాక్యములఁదిలకించితిరా? మాతండ్రిగారికి నేను నెలకుఁగాని వత్సరమునకుఁ గాని నాస్వార్జితమునుండి పైసయేని యీయవలసియు లేదు, ఇచ్చుటయు లేదు. ఇట్టిస్థితిలో నామాత్రమేని యిచ్చుచున్నట్లు వ్రాయు మాకృతఘ్నుఁడు కడుయోగ్యుఁడుగదా? మాతండ్రిగారు పితృపితామహార్జిత మగుభూమి శిస్తునుండి రైతులవలన సం॥ రము ౧ కి రు 82-0-0 లు మాత్రము కైకొని మాచెల్లెలి గారికిచ్చి వారియింటఁబదిమాసములును సెలవులలో నాయొద్ద రెండుమాసములును వసించుచున్నారు, వారి కవసరములేక కైకొనుటలేదు గాని యంతకధికము కావలసియున్నను నన్ను వారడుగ వలసిలేదు, వారిభూమియే వారి కీయఁగలదు, ఈయంశమిక్కడ నేను క్రొత్తగా వ్రాసినదికాదు, గురుదక్షిణలో 22 వ పుటలో నేటొక ప్రసక్తిలోఁ దెల్పినదియే, ఇదికొలబత్తెమో వారియిచ్ఛానుసారమగు పోషణమో ప్రాజ్ఞులు విచారింప నర్హులు, మఱియు నీదురపవాద లిఖించుఘట్టమున మాతండ్రిగారి నీనికృష్టుఁ డెంతో నీచముగా నపవదించెను, అది యంతయు నిర్యోడ విస్తరించుట యుక్తము గాదు ప్రస్తుతమును గాదు, ఏవిధమైనమనోవైషమ్యములు గాని మాతండ్రిగారికిని నాకును లేవు, అనునదిమాత్రమే ప్రస్తుతాంశము, అదియేవిచార్యము, మఱియు మాకృతఘ్నులు వెం॥ రాలలో రెండవవాని తండ్రిగారును గొడుకును మావలెనే వేఱువేఱుచోటుల వసించుచున్నారు. అవసించుటకుఁ గలకారణమును మేము శతధా సహస్రధా కాఁకరపత్తివాస్తవ్యులవలన వినియుంటిమి కాని యొకఁడు చెప్పఁగాఱికిన వేఱొకరుఁడు సిద్ధిగా అటకు సిద్ధపడినటు లుండు నాప్రసంగ మిటవిస్తరింపఁ దలపఁము, అయనయు మాతండ్రిగారివలె నేకపుత్రకుఁ డేవృద్ధులే, మామానివాసములవలె వారివారి నివాసగ్రామములం

దూరములును గావు, బందరునకును ఏనామునకును నెంతదూరమో కాఁకరపఱ్ఱకిని పిఠాపురమునకు నెంతదూరమో యిందువ్రాయవలసి యుండదు, కావున నాయనఘుఁడు కొమరుఁడుండుచోటున నుండక స్వగ్రామమందే వసించుటకేమి కారణమున్నదో సూక్ష్మమతులు విచారించినఁ దేలక పోదు. ఆయనపూర్వాచారపరాయణులు, కొడుకు బ్రహ్మసామాజికమతప్రవిష్టుఁడు, అట్టిస్థితిలో నాయనఘుఁడు.

"పుత్రమంతేచకర్మణి"

అనువచనమునీ సామాజికప్రబుద్ధుఁడు సార్థకపఱుచు నని యెట్లు విశ్వసింపఁ గల్గెడిని, కావున నెట నున్న నేమగు? ఆయన యీప్రబుద్ధునివిషయమునఁ బొందుచున్న విచారమునకుఁ బారమే లేదని విందుము. ప్రకృతము వారివిచార మిందెత్తుటకుఁ గల ప్రసక్తి ఆపితాపుత్రులకుంబలె నాపితాపుత్రులకు మతవైమనస్యముగాని ఆచారవైమనస్యముగాని లేదని తెల్పుటకేయని యెఱుఁగఁదగు, అంతియకాని వాండ్రతోఁ దుల్యత్వము సంపాదింప నుంకించుటగా భావింపకుందురుగాక, మాకృతఘ్నుని దురాగతము చెల్పితిని గాన వాని కించుక నీతిం గఱపి చూచెదము, ఓయీకృతఘ్నా పశేదా? నిర్భీకా? వావదూకా! నీకుఁ బరలోకమున్నదని యిసుమంతేని నమ్మకమున్నచో నీక్రింది విషయమును మనమున నెక్కించికొని పశ్చాత్తప్తుండవై వృథాపవాదలను గిలుక మాని వర్తిల్లుదువుగాక.

(అచ్చగుచున్న లోకాభిరామాయణమునుండి)

ఉ॥ కట్టుచునున్నవారు గృహకాండము నారకమందు; నన్నముల్
బెట్టకతండ్రి నిల్ వెడలనెట్టినవాండ్రకునై, గురుల్ దెగన్
దిట్టినవాండ్రకై; యొకట నే మనముండవలెన్ దురాగతం
బుట్టిపడంగఁగూయుభవదుక్తులు సత్యములేని యర్భకా॥ ౧

ఉ॥ తీసియె యుంచినారలఁట? తీఱనిగోతులు తండ్రినాత్మయా
వాసమునుండి గెంటువలవాండ్రకునై; గురుఁ దప్పఁగూఁతలన్
గూసెడివాండ్రకై; యొకటఁగూలవలెన్ మనమీవువ్రాయునా
దోసమునిక్కమేని యెటు ద్రోహము లూరక పోవు నర్భకా॥ ౨

ఉ॥ చెక్కియయుంచినారలఁట? చిక్కనిమేకులు; నీకు నాకుఁ బె
న్మక్కువ నంటఁగొట్టుటకు; మానరు మానుఁడటన్నఁ దండ్రికిం

ఆ॥ వేలమూరికొలపుఁ బాలసంద్రమునకు
శుభ్రకిరణుఁడైన సుబ్బరావు
జెడ్జికోర్టులోనఁ జెలఁగు శిరస్థదా
ర్పదవినధిగమించి పరఁగుచుండె॥ 60

చ॥ అరితతిపట్ల భీమతయు నాప్తులపట్లను శంకరత్వమున్
సురుచిర రాజకీయసభఁ జొచ్చెడిపట్లఁ దదష్టమూర్తితా
స్ఫురణయుఁ జర్చపట్ల రహిఁ జొప్పడి త్ర్యంబకతాప్రశస్తి యా
సరసు శిరస్థదారతను సార్థకముం బొనరించి మించెఁగా॥ 61

క॥ ప్రాతఃకృత్యము లెల్లను। నాతర్వాతన్ రయంబ యరిగితి నేత
త్ఖ్యాతుని యింటికి, శిష్టా। సీతారామార్యుఁడు దయచేసెను నపుడే ॥62

క॥ దయచేసికూరుచుండుచు। నయభయములనొద్దఁ జేరునన్ గని "త్వష్ట్రి
స్వయజులగోత్రములోకకొ। న్ని యెఱింగింపంగవలయునీ"వనియనుచున్॥

చ॥ సరియగుసాక్ష్యమున్ నుడువుచాడ్పున నేమియొ మాటలాడ సం
బరపడి నేనుబోయితిని, భక్షణచేసి తదార్యుఁడంతఁ జె
చ్చెరఁ బదిగంటలౌసరికిఁ జేరి కచేరధికారిరాకకై
త్వరపడుచుండ దాగమున తత్పరుఁడై వసియించె వాకిటన్॥ 64

క॥ ఏతెంచెను మున్సిఫ్ గార్
తేతెమ్మని మారికార్డె తెప్పించె వెసన్
సీతారామబుధా! యని
స్ఫీతరవంబునజవాను పిలిచెన్ ముమ్మార్॥ 65

క॥ చెచ్చెరసాక్ష్యస్థానము
చొచ్చి*తదార్యుండు స్వేచ్ఛచొప్పునఁబలికెన్
వచ్చివకీల్ ప్రశ్నించిన
హెచ్చౌ ధోరణిమఱింత యేమని చెపుదున్॥ 66

---

...... The 29th day of August 1911.

* ....శిష్టా సీతారామశాస్త్రిగారు.....గుంటూరు.......

ఆ॥ *విశ్వకర్మయనఁగ వెలసి నవబ్రహ్మ
లందు నొక్కబ్రహ్మ యలరునంట
సృష్టికార్యమునకుఁ జేదోడుగా వారు
బ్రహ్మచే సృజింపఁబడిరియంట॥ 67

తే॥ §విశ్వకర్మాహ్వయంబున వెలయునతఁడు
వసువులందొకఁడైన ప్రభాసుకొడుకు
క్రతుభుజులశిల్పిగానితాఁ గాఁడుబ్రహ్మ
‡బ్రహ్మలుమరీచిముఖ్యులౌ బ్రహ్మసుతులు॥ 68

ఆ॥ భారతాదికములఁబఠియింప సామాన్య
జనులుకూడ నెఱుఁగుచరితమిట్టుల
మార్చి చెప్పనట్టి మహనీయుసాక్ష్యము
దెంతసత్యముండ కేమియగును॥ 69

క॥ †కమసాలవాని గీర్వా
ణమునం బండితులువాడునామంబే యీ
సుమనీషి కెఱుక లేదఁట
క్రమమో యక్రమమొ దీనిఁగనుగొనుఁడుజనుల్!॥ 70

---

వేదములో విశ్వబ్రాహ్మణులు అనే పదము యెక్కడ లేదు-*విశ్వకర్మఅని నవబ్రహ్మలలో ఒకబ్రహ్మవున్నాడు. ఆయన దేవతలకు శిల్పిఅయివున్నాడు. పూర్వము కంసాలీలు వడ్లవారు కంచర్లు అనేవారిని యిప్పుడు విశ్వబ్రాహ్మణులని పిలుస్తున్నారు. †యీకంసాలి వడ్ల కంచర్లను సంస్కృతములో యేపేరుచేత పిలువవలసినది

---

పురాణనామచంద్రిక 180 వ పేజీ.

§విశ్వకర్మ:— ప్రభాసునకు యోగసిద్ధియందుపుట్టినకొడుకు. ఇతడు దేవశిల్పి
130 వ పేజి.

‡బ్రహ్మ:—త్రిమూర్తులలో ఒక్కడు...ఇతనివ్యాపారముసృష్టిచేయుట. తొలుతఇతనికి అనేకులు మానసపుత్రులుకలిగిరి. వారిలో తొమ్మండుగ్రు ప్రజాసృష్టికి కారణభూతులు అయి నవబ్రహ్మలు లేక నవప్రజాపతులు అనబడిరి. వారు మరీచి, అత్రి, అంగిరసుఁడు, పులస్త్యుఁడు, పులహుడు, క్రతువు, భృగువు, వశిష్ఠుడు, దక్షుఁడు, అనువారు.

ఆ॥ చదివెనంట యాఱుశాస్త్రంబులం దాను
అభినివేశమున్న దంట లెస్స
రామరామ యితఁడు *రథకారశబ్దార్థ
మెఱుఁగఁడంట, యిద్ది యేటివింత॥ 71

క॥ మొదటన్ §షట్కర్మలలో
నిది కాదు ప్రతిష్ఠ యని యనెన్ వెంట నెతా
నది యాజనమున నుండెడి
పదియార్కర్మలనొకటయి పరఁగెడునను చున్॥ 72

---

నాకు తెలియదు. రథకారులని ఒకశబ్దము వున్నది. అది వారికి చెందదని వారు అంటున్నారు. నాశాస్త్రజ్ఞానమునుబట్టి యిప్పుడు విశ్వబ్రాహ్మణులని పిలువ బడేవారికి *రథకారశబ్దము వుపయోగిస్తుందేమో చెప్పలేను. ప్రతిష్ఠకర్మ బ్రాహ్మణులే చేయించవలెనని శాస్త్రములలో చెప్పబడివున్నది. యిది ఆగమములలో చెప్పబడివున్నది. ప్రాణప్రతిష్ఠ §షట్కర్మలలోదికాదు. షట్కర్మలలోయాజనము జీవనార్థము పుట్టినదే. ప్రాణప్రతిష్ఠ యాజనములోవున్న 16 కర్మలలో ఒకటి-యాజనములో ధ్యానము ఆవాహనము మొదలైనవి 16 వున్నవి. ప్రాణప్రతిష్ఠ ఆవాహనముక్రింద చేరుతుంది, యిది ఆవాహనముక్రిందికి వస్తుందని ఆగమములలో చెప్పబడివున్నది. కలియుగమునకు పరాశరస్మృతి నిర్ధారణమైనస్మృతి. అందులో 6 కర్మలు బ్రాహ్మణునకు చెప్పబడినవి. యాజనకర్మ పరాశరస్మృతివలన బ్రాహ్మణునికే చెప్పబడివున్నది. ప్రాణప్రతిష్ఠ యితర్లుచేయడం గలదు. యితరకులస్థులు ప్రాణప్రతిష్ఠచేస్తే అట్టిదేవాలయములు ప్రాణప్రతిష్ఠచేసిన కులమువారికి వారికంటె తక్కువ కులమువారికి పూజకు అర్హములుకాని వారికంటే యెక్కువకులమువారికి అర్హములు కావు. బ్రాహ్మణుడు ప్రాణప్రతిష్ఠచేస్తే అన్నికులములవారి పూజకు అర్హములు. విశ్వబ్రాహ్మణులు ప్రాణప్రతిష్ఠచేసినగుడి వున్నదేమో నాకు తెలియదు. నాయెరుక పట్లచేయలేదు. షుమారు 20, 30 యేండ్లక్రింద కంసాలికుటుంబము అనేఆయన ప్రాతగుంటూరులో ఒక దేవాలయమును కట్టించి వారిలో ప్రాణప్రతిష్ట చేసేవారున్నను బ్రాహ్మణులచేత ప్రాణప్రతిష్ఠచేయించినాడు. యిప్పుడు బ్రాహ్మణపూజారి అర్చకుడువున్నాడు. Cross. క్షత్రియరుషులు క్షత్రియగోత్రములకును వైశ్యరుషులు

క॥ అన్యాయ్యములగుటయెకా।గన్యోన్యవిరుద్ధధర్మ సులవడియుఁ స
న్మాన్యములుకానినుడులీ!ధన్యుం జేమనిన చింపఁదలఁచెనొ మదిలోఁ ౯ః

---

వైశ్యులకు మూలపురుషులుగా వున్నారు. బ్రహ్మరుషులు బ్రాహ్మణులకు మూలపురుషులుగావున్నారు. విశ్వామిత్రరుషిగోత్రము క్షత్రియులలోను బ్రాహ్మణులలోను వున్నది. లోకకర్తఅయిన ఆదినారాయణమూర్తికి హిరణ్యగర్భుడైన చతుర్ముఖబ్రహ్మ పుట్టినాడు. ఆయనముఖమునుంచి బ్రాహ్మణులు క్షత్రియులు భుజమునుంచి వైశ్యులు తొడలనుంచి శూద్రులు పాదములనుంచి పుట్టినారు. అప్పుడు ముఖమునుంచి పుట్టినబ్రాహ్మణులందరు రుషులయినారు. యిప్పుడుబ్రాహ్మణులందరు వారి సంతతివారు. బ్రహ్మకు 5 ముఖములువుంటే ఒకముఖము సాంబమూర్తి తెగగొట్టినాడు. విశ్వకర్మఅని విరాటుకు పేరువున్నది. త్వష్ట నవబ్రహ్మలలో ఒకడైన విశ్వకర్మకుమారుడు. త్వష్టఅనగా చెక్కేవాడని అర్థము. శిల్పాదులనేవారందరు విశ్వకర్మసంతతివారు. చతుర్ముఖబ్రహ్మ తాను సృష్టించుట కష్టమని తనకు సహాయముచేయుటకు నవబ్రహ్మలను సృష్టించినాడు. బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులు హిరణ్యగర్భుడైన చతుర్ముఖబ్రహ్మవలన పుట్టినారు. అత్రి మరీచి విశ్వకర్మ అనిమొదలైనవి నవబ్రహ్మలపేర్లు యీతొమ్మిది బ్రహ్మలుకలిసి సృష్టిచేసినారుగాని వారిలో ప్రతివాడు వేరేవేరేజాతివారని సృష్టించలేదు. విశ్వకర్మసంతతివారు చతుర్ముఖబ్రహ్మవలన పుట్టినవారిలో చేరరు. విశ్వకర్మసంతతివారు చతుర్ముఖసంతతివారికంటే యెక్కువవారనిగాని వారికంటే వీరుయెక్కువవారనిగాని యెక్కడ లేదు. సానగ, సనాతన అహభూన, ప్రత్నస, సుపర్ణ, యీ 5 గురు వేదములోచెప్పబడినరుషులే. బ్రాహ్మణులకుచెప్పబడిన 8 మంది రుషులలో వారుచేరరు. విశ్వామిత్ర, జమదగ్ని, భారద్వాజ, గౌతము, అత్రి, వశిష్ట, కశ్యప, అగస్త్య, యీ 8 మంది బ్రాహ్మణరుషులు. వీరు వీరిసంతతివారు మాబ్రాహ్మణప్రవరలోవస్తారు. యీరుషులు యజుర్వేదములోవున్నారు. యీరుషులు కృష్ణయజుర్వేదములోవున్నారు. నాది తైత్తిరీయశాఖ. విశ్వకర్మ రుషియేమో నాకుతెలియదు. ఆయన బ్రాహ్మణరుషులలోలేడు. బ్రాహ్మణులకు 49 గోత్రములు. యీ 49 గోత్రములవారు నేనుపైనచెప్పిన 8 బ్రాహ్మణరుషులసంతతిలోనివారు. క్షత్రియులకు బ్రాహ్మణులగోత్రములుకొన్ని వున్నవి. శ్రీరాముఁవారిగోత్రము వశిష్టగోత్రము. జనకులవారిది గౌతమసగోత్రం. ధర్మరాజులది ధౌమ్యసగోత్రము. క్షత్రియులు

ఆ॥ *ఆదికృతయుగమున నందఱుపురుషులే
స్త్రీలు లేరటంచుఁ జెప్పెనితఁడు
ఏతదాదికంబు లీశాస్త్రిగారి సా
క్ష్యమునఁగలవు బూటకములు కొన్ని॥ 74

వారిపొరోహితులగోత్రమును కొంతమంది పెట్టుకున్నారు. *ఆదికృతయుగములో అంతా పురుషులు. స్త్రీలు లేరు. వారంతా శ్వేతవర్ణులు గావుండెడి. త్రేతాయుగముదగ్గరనుంచి స్త్రీవర్ణము యేర్పరచినారు. ఆత్రేతాయుగమునుంచే పెండ్లిండ్లు కర్మలు ఆరంభమయినవి. ఆత్రేతవరకు వృత్తులు లేవు. మొదటికృతయుగములో పనిపాటలవారిఅవసరము లేకపోయినది. వారు విశ్వకర్మసహాయమువలన అన్ని నిర్మించుకొనెడి నేను పైన చెప్పిన49 గోత్రములలో ఒకగోత్రముకలిగి వారప్రవరలో నేను చెప్పిన 8 మందిఋషులలో కొందరినిగలవారు యిప్పుడు బ్రాహ్మణులని చెప్పవలెను గాని వానికర్మలచేత గాని గుణములచేత గాని విడదీయవీలు లేదు. ఉపనిషత్తులు 10 ఉన్నవి. అందులో వజ్రసూచికోపనిషత్తు ఒకటికాదు. వజ్రసూచికోపనిషత్తులో ఆత్మనుబట్టి బ్రాహ్మణుడా దేహమునుబట్టి బ్రాహ్మణుడా అని ప్రశ్నవచ్చినది. అప్పుడు అది తత్వసంబంధమైనప్రశ్న కాదని కొట్టివేశినారు. జాతి లోకసంబంధమని చెప్పబడివున్నది యీభరతఖండమునకు మట్టుకే యీజాతిభేదము. యెందుకు చెప్పినారో చెప్పవీలు లేదు. ఆదికృతయుగములో నాలుగు జాతులులేకపోయినా కొద్దిభేదముండెడి. అప్పటికి కర్మలు లేవు. త్రేతరాగానే కర్మపుట్టినది. కృతయుగములో పూజయే వారివృత్తి. ఆదికృతయుగములో మనుస్మృతి లేదు. త్రేతాయుగములో మనుస్మృతి పుట్టినది. మనుస్మృతిభృగుప్రోక్తము మనువు ధర్మములుచెప్పితే ఆయనశిష్యుడైనభృగువు శ్లోకరూపేణా చెప్పినాడు. పరాశరస్మృతి మొన్నపోయినద్వాపరములో పుట్టినది లేక మొదటిద్వాపరములో పుట్టినది చెప్పటకు వీలు లేదు. దానిని నిర్ధారణపర్చుటకు సంస్కృతములో యేమి ఆధారము లేదు. భారతము మట్టుకు వ్యాసులు చేసినారు. తక్కినపురాణములు యితరులుచేసి ఆయనకు చదివి వినుపించి ఆయనవల్ల ప్రోక్తములయినట్లు చేసినారు. భారతధర్మములు న్యాయప్రమాణములే అయివున్నవి. భారతము వ్యాసులవారు శ్లోకరూపముగ చెప్పినది యెట్లా చెప్పినది నిర్ధారణచేయుటకు వీలు లేదు. షట్కర్మలు ద్విజేతరులకు లేవు. ప్రాణప్రతిష్ఠకము శ్రుతిస్మృతులలోను ఆగమములలోను చెప్పబడివున్నది. ప్రతిష్ఠాకల్పమని ఆగమములలో ఒక

అధ్యాయములోవున్నది. షోడశకర్మవిధానమునూత్రములలోవున్నది. గ్రామదేవతలలో బ్రాహ్మణులుపూజచేసేవికొన్ని వున్నవి. కొన్ని పూజచేయనివివున్నవి. బ్రాహ్మణులు గ్రామదేవతలనుపూజించుటను మానుకున్నారు. మాలమాదిగలువచ్చి బలులు యిచ్చుటవలన అక్కడికి పోవీలులేక మానుకున్నారు. బ్రాహ్మణులు బలులుచేయగూడదుగాని తక్కినజాతులవారు చేయవచ్చును. గ్రామదేవతలకు చాకలివాడు అన్నమువండుకునివస్తాడు. కుమ్మరి నైవేద్యము పెడుతాడు. గ్రామదేవతల ప్రతిష్ఠపట్టుకు బ్రాహ్మడేచేయవలెను. వుండిసీమలో బ్రాహ్మణులుప్రతిష్ఠచేసిన గ్రామదేవతలువున్నవి. యీ సీమలో వున్నవేమో నాకు తెలియదు. నేను గుంటూరుతప్ప యితరవూళ్ళకు వెళ్ళలేదు. అంటుజాడ్యములు వచ్చినప్పుడు ఆత్మూవచీకిగాను కొబ్బరికాయపెట్టిచేసేపూజలకు బ్రాహ్మణులే పూజచేస్తారు. మాది రేపల్లె. మావూళ్లో కుమ్మరివాండ్లు చేస్తారు. విశ్వబ్రాహ్మణులలో యెవరు యాజనముచేయించగా చూడలేదు. పులివర్తి వీరయ్య షోడశకర్మలు వారియిండ్లలో చెయించేవాడు. ఆయనచేయించడం 25 యేండ్లనుంచి యెరుగుదును. యింకొకఆయన పాతకమూరి సుబ్బారాయుడు చెయించేఆయనవున్నాడు. లింగప్రతిష్ఠచేయునపుడు లింగముకు సజ్జరసము వేసి బిగించకపూర్వము కొంతకర్మజరిగినా బిగించిన తరువాత శుద్ధిచేసి మళ్లీ ప్రాణప్రతిష్ఠచేస్తారు. స్థలకర్షణముకు బ్రాహ్మణులకు యేమిసంబంధములేదు స్థలకర్షణము అయినతర్వాత వాస్తుపూజ గణాధిపతిపూజ చేస్తారు. వాస్తుపూజ డబ్బుబియ్యం బ్రాహ్మణుడుపూజచెయించి వడ్లబత్తుడికి యిస్తాడు గణాధిపతిపూజకువచ్చే డబ్బు బియ్యం బ్రాహ్మణుడు తీసుకుంటాడు. విగ్రహమును మూడు సం॥లు చేయవలెను. ఆగమశాస్త్రములలో 9 నెలలు విగ్రహముచేయవలెనని చెప్పబడివున్నది. గర్భస్థమయినశిశువుకు 7 మాసములో ప్రాణివస్తుంది. అమరములో రథకారశబ్దము వడ్లవానికివర్తిస్తుంది. యీవిశ్వబ్రాహ్మణులకు రథకారశబ్దము వర్తిస్తుందని చెప్పలేను. లోహములపనిచేసేవారికి వేరువేరు పేట్లు చెప్పబడివున్నవి. త్వష్టఅని బ్రహ్మకు పేరువున్నది- లోహకారుడనగా గనులనుండితెప్పియినుముచేసేవానికి చెప్పబడివున్నది. గ్రామపౌరోహితము చేసేవారు బ్రాహ్మణులలోచివరవారని మనుస్మృతిలో చెప్పబడివున్నది గాని వారుబ్రాహ్మణులే. వాది వైదికబ్రాహ్మణుడు. నేను వైదికబ్రాహ్మణుడనే. నేను వాదిని యెరుగను. అతనివృత్తియేమో నాకు తెలియదు. శిష్టికరణాలని తూర్పున వున్నారు. అమరములో చెప్పబడిన సంకరజాతులు యిప్పుడు లోకములో యేజాతివారికి

క॥ చండాలి *యరుంధతియని మండకొందురు లెవ్వరేని మొఱగుతఁ
దానుద్దండుండని చెప్పందగు పండితుఁడైయిట్లు చెప్పఁబొల్పడేనరకే॥

క॥ ఘనకర్దమప్రజాపతి తనుజ §యరుంధతియనంగ,ధరఁ బ్రఖ్యాతిన్
గనినపతివ్రత,ఆమెనె మనసీతారామశాస్త్రి మాదిగదనియెన్॥

క॥ మాదిగలుం దత్సదృశులు వాదించుచునుండి రింతవఱకిద్దానిన్
భూదివిజుఁడయ్యునీతఁడు తాదిగె నివ్వాదమునకు,ధన్యుఁడుగాఁడే॥

---

వర్తించేది నాకు తెలియదు. కరణాలని చెప్పను నేవారు యితరులువున్నారు. కరణంఅనేమాటకుఅర్థము వ్రాసేవాడని, శిష్టికరణాలుగాక కరణాలనిచెప్పను నేవారు. బ్రాహ్మణులలోశేరు కరణముఅనేమాట దేశభాషలో గ్రామములోకరిణీకములెక్కలు వ్రాసేవానిని అంటారు. యెవరుకరిణీకపులెక్క వ్రాస్తే వానిని కరణమంటారు. వశిష్టుని భార్య*అరుంధతి చండాల స్త్రీ అరుంధతికుమారుడు శక్తి-శక్తికుమారుడు పరాశరుడు.

---

పురాణనామచంద్రిక 16 వ పేజీ

§అరుంధతి:— కర్దమునికూఁతురు. వశిష్ఠునిభార్య. మహాపతివ్రత. కనుక ఇప్పటికి పెండ్లినాటిరాత్రి ఔపాసనానంతరము నక్షత్రరూపమున ఉండునీమెను పాతివ్రత్యనిష్ఠకై పెండ్లికుమార్తెకు చూపుదురు.

41 వ పేజీ

కర్దమప్రజాపతి. బ్రహ్మచ్ఛాయయందు పుట్టినయతఁడు......

భాగవతము. తృతీయస్కంధము.

208 వ పేజీ

వ॥ అంత నా కర్దముండు కమలసంభవచోదితుండగుచు యథోచితంబుగా నాత్మీయదుహితలవివాహంబు సేయందలంచి మరీచికిం గళయనుకన్యకను,నత్రికి ననసూయను, నంగిరసునకు శ్రద్ధను, బులస్త్యునకు హవిర్భువును, బులహునకు గతిని,గ్రతువునకుఁ గ్రియను, భృగునకు ఖ్యాతిని, వసిష్ఠునకు నరుంధతిని,నథర్వునకు శాంతినింగా నిజకులాచార,సరణిం బరిణయంబుగావించిన......

తే॥ *శక్తిభార్య యదృశ్యంతి స్పష్టముగను
తాఁ బ్రమాణంబనిన భారతంబునందె
యుండెనిటుల,శ్వపాకియంచుండదెచట
ఏమనివచించెనోయాతఁ డెఱుఁగ నేను॥ 78

*శక్తిభార్యపేరు శ్వపాకి-అనగా కుక్కమాంసముతినేది అని అర్థము-శ్వపాకిజాతి సంకీర్ణజాతులలో అధమాధమము. పరాశరుడికుమారుడు వ్యాసుడు- తపస్సేముఖ్యమని చెప్పుటకుగాను వ్యాసులవారు తన కులసంగతి చెప్పినాడు. వాల్మీకి బ్రాహ్మణుడు-యిప్పటిబ్రాహ్మణులు ఆసంతతివారే. నవబ్రహ్మలలో దక్షుడు బ్రహ్మఅంగుష్ఠమువలనపుట్టినాడు. జాతులునాలుగుసమానమే. హెచ్చుతగ్గులులేవు. సంకరజాతులుతక్కువవి- భాగవతము ద్వాదశస్కంధములో చెప్పబడివున్నది. వేదములలో వైదికులు నియోగులని వేరువేరుశాఖలు చెప్పబడియుండలేదు. క్షత్రియబ్రాహ్మలులేరు. శాస్త్రములో దశవిధబ్రాహ్మణులులేరు. వృత్తులు జాతులు వకసారేపుట్టినవి. వృత్తులు జాతికంటే ముందుపుట్టినవనియు చెప్పవచ్చును. ఆదిత్రేతాయుగముదగ్గరనుంచి వృత్తులు అమలులోకివచ్చినవి. ఆగికృతాయుగములో జనులకు క్షుత్పిపాసములులేవుగనుక వృత్తులులేవు. నాకు అభిమానశాస్త్రములేదు. నేనుసంస్కృతముచదువుకున్నాను. నేను చదువుకున్నవన్ని అభిమానశాస్త్రములే- నేనుషట్శాస్త్రములు చదువుకున్నాను. నేను ఆరుశాస్త్రములు పూర్తిగా చదివినాను.

రీమార్కు—విశ్వబ్రాహ్మణఅనేపేరు కంసాలీలు కంచర్లు వడ్లబత్తులు వారికివారు పెట్టుకున్నారుగనుక అట్లాపిలుస్తున్నారు. రథకారులలో రెండుజాతులున్నవి. ఒకటి దేవవాహనముచేసేవాడు రెండవది సంకరులలో రథకారులనివున్నారు. వారికి వృత్తి యేమి చెప్పబడివుండలేదు. గ్రామదేవతలప్రతిష్ఠమట్టుకు బ్రాహ్మడిదేగాని బ్రాహ్మణులుపూజవద్దగిరా మాలమాదిగలువాడడమువల్ల నేనుయెరిగినచోట్లమానుకున్నారు.

పురాణనామచంద్రిక 9 వపేజి.

*అదృశ్యంతి......శక్తిభార్య. పరాశరునితల్లి.

భారతము, ఆదిపర్వము, సప్తమాశ్వాసము, 185 వ పేజీ

వ॥ ......వసిష్ఠుండు నిజాశ్రమంబునకు వచ్చువాఁడు దనపిఱుందవచ్చుకోడలి నదృశ్యంతియనుదాని శక్తిభార్య నప్పుడెఱింగి...... 124

# ప్రధానపోషకులు

1 శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు.
2 శ్రీ రాజా కోటగిరి వెంకటకృష్ణారావు బహదరు కుమార జమీందారుగారు గంపలగూడెం

## సహాయులు.

14 కాకుమాను హనుమయ్యగారు నర్సారావుపేట
15 తంగెడ నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు.
16 వెలుగూరి పిచ్చయ్యగారు, కొదమగుండ్ల.
17 తుమురుగోటి నరసింహారావుగారు, తిరుమలగిరి.
18 గొల్లపూడి వేంకటసుబ్బారావుగారు, వాల్కార్టుబ్రదర్సుకంపెనీ.
19 ఉక్కుమళ్ళ గోపాలరావుగారు, కరణం, అమిదీపురం.

## ఈనెల సొమ్ముచెల్లించిన చందాదారులు

1 న్యాపతి హనుమంతరావుగారు, ప్లీడరు, గుంటూరు.
2 లంకా వెంకటనారాయణగారు, పందిరిపాలెము
3 దూపాటి తిరుమలవెంకటరమణాచార్యులుగారు, శతావధాని, తక్కెళ్ళపాడు.
4 అన్నంరాజు సుందరరామయ్యగారు, దిగోపాలెం
5 తాడేపల్లి వెంకటప్పయ్యశాస్త్రిగారు, చందోలు
6 పిరాట్ల సత్యనారాయణగారు, చింతపల్లి
7 చింతపల్లి రాఘవయ్యగారు, కరణం, చింతపల్లి.
8 దేవరకొండ జగన్నాథరావుగారు, తాలూకాక్లార్కు, గురిజాల
9 లంకా అంబయ్యశాస్త్రిగారు, అంబాపురము.
10 లంకా సుందరరామశాస్త్రిగారు, అంబాపురము.
11 నడింపల్లి లక్ష్మీనారాయణగారు, ఫారెష్టురేంజీక్లార్కు, బాపట్ల
12 మన్నేపల్లి సుందరరామయ్యగారు, డిస్ట్రిక్టుమున్సిఫ్‌కోర్టునాజరు, బాపట్ల.
13 మరుగంటి పున్నయ్యగారు, ప్లీడరు, వంగవోలు
14 పంచాగ్నుల సుబ్రహ్మణ్యముగారు, ప్లీడరు, కావలి.
15 సుసర్ల రామశేషయ్యగారు, బ్రాహ్మణకోడూరు.
16 భువనగిరి బుచ్చిపరదేశిసోమయాజులుగారు, డిస్ట్రిక్టుమున్సిఫ్‌కోర్టుక్లార్కు, నరసారావుపేట.
17 బుజ్జా పార్వతీశముగారు, లోకల్‌ఫండుఓవరుసీయరు, నర్సారావుపేట.
18 చింతలపాటి రామమూర్తిశాస్త్రిగారు, గుడివాడ

# అభినవసరస్వతి

## పత్రికాధిపతి జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇదియొకమాసపత్రిక-ఇందు ప్రాచీననవీనాంధ్ర ప్రబంధములును, నాటకములును, విమర్శనములును, విద్యావిషయిక మతవిషయిక వ్యాసములును ప్రకటింపఁబడును. ప్రాజ్ఞసమ్మతములగు తాత్కాలిక వ్యాసములవలనఁగలుగు నానందముగాక చందాదారులకు 2-3 అపూర్వగ్రంథము లలవడును. చందాసంవత్సరమునకు రు 2-0-0

### ఈకార్యస్థానమున వెలకుదొరకుపుస్తకములు.

| | | |
|---|---|---|
| 1 | అళియారాచార్యవిజయము .. ... | 0-4-0 |
| 2 | కరిణీకోద్ధారిణి (పూరె వీరభద్రకవి) .. ... | 0-4-0 |
| 3 | వాసంతికా పరిణయము } ... ... | 0-4-0 |
| 4 | కంసవధము } ఇవి రెండు నాటకములు ... | 0-8-0 |
| 5 | చమత్కారమంజరి ( సింహాద్రి వెంకటాచార్యులు ) ... | 0-4-0 |
| 6 | విరూపాక్షపీఠగురుపరంపర ... ... | 0-2-0 |
| 7 | నీతిగీతులు. ( సుమతి శతకమునకు సంస్కృతము ) ... | 0-2-0 |
| 8 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము ... | 0-2-0 |
| 9 | అత్యద్భుతవిమర్శనము (మం॥ కృష్ణద్వైపాయనాచార్యులు. వెంకటరామకృష్ణకవులయవధానములపైవిమర్శనము } ... | 0-5-0 |
| 10 | చిత్తూరిజిల్లా తీర్పువిమర్శనము ( పత్రికాధిపతి ) ... | 0-4-0 |
| 11 | సంగదోషము. ( సంగదోషము చేబట్టుదలవదలనియోగుల చరిత్రదెలుపు నొకచిన్న పద్యరూపమగు కథ } ... | 0-3-0 |
| 12 | వీరభాగవతము ( ముదిగొండ వీరభద్రకవి ) .. | 1-4-0 |
| 13 | పుళిందావివాహము ( పత్రికాధిపతి) ... | 0-4-0 |
| 14 | గురిగింజ, వత్సలనీతిశతకము, వ్యాసనిష్కాసనము, పిష్టపేషణము | 0-4-0 |
| 15 | శివానందలహరి. ( తంగెడ రామకృష్ణకవి ) .. | 0-4-0 |
| 16 | లక్ష్మీవిలాసము( రాయసము వెంకటపతి ) ... | 0-4-0 |
| 17 | నర్సారావుపేట శతావధానము ( తిరుపతివెంకటీయము ). | 0-3-0 |
| 18 | పశ్యాంపుశ్యాం ,, | 0-2-0 |
| 19 | పశ్యశబ్దవిచారము ,, .. | 0-2-0 |
| 20 | వేమవరాగ్రహార శతావధానము ,, ... | 0-12-0 |
| 21 | పురశ్చరణము ,, | 0-2-0 |

వలయువారలు సొమ్ముపంపిగాని, వి. పి. ద్వారాగాని, ఈ క్రిందివారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

జానపాటి పురుషోత్తం, సబ్ ఎడిటర్

జానపాడు, పిడుగురాళ్ళపోష్టు, గుంటూరుజిల్లా